131

# ఋతుసంహారము

(కాళిదాసమహాకవి ఋతుసంహారకావ్యమున కనువాదము)



డా. తిరుమల కృష్ణదేశికాచార్యులు

# ఋ తు సం హా ర ము

కాళిదాసమహాకవి ఋతుసంహార
కావ్యమునకు ఆంధ్రానువాదము

గ్రంథకర్త
## డా. తిరుమల కృష్ణదేశికాచార్యులు
పినవా, మానిటోబా, కెనడా

## యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
ఆంధ్రసారస్వత పరిషద్భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు - 500001

RITUSAMHARAMU - A translation of the Kalidasa's Sanskrit work RITUSAMHARA into Telugu, by Tirumala Krishna Desikacharyulu, Atomic Energy Of Canada, Pinawa, Manitoba, Canada.

---

Copyright © 1990 By The Author

యువభారతి
ప్రచురణ క్రమసంఖ్య 131
ప్రథమ ముద్రణము : జనవవరి, 1990
ప్రతులు : 1000

ముద్రణ కూర్పు : : గ్రంథకర్త ( Macintosh కంప్యూటరు పై)
ప్రతుల ముద్రణ : సమతా పవర్ ప్రెస్, హైదరాబాదు
ముఖచిత్ర రచన : శ్రీ షణ్ముఖాచారి

వెల: 16 రూపాయలు

ప్రతులకు

యువభారతి కార్యాలయము
ఆంధ్రసారస్వత పరిషద్భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు - 500001
లేదా
యువభారతి, 5 కింగ్స్‌వే, సికిందరాబాదు -500003

# మరొక వెలుగుతోరణం

యువభారతి కడచిన ఇరవైఅయిదేళ్లుగా సమాజంలో సక్రమమైన సాహిత్యావగాహనను యువతరానికి అందించడానికి అహరహం కృషిచేస్తున్నది. సాధ్యమైనంత తక్కువవెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందజేస్తే, సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది.

1990 యువభారతి రజతోత్సవసంవత్సరంగా పాటిస్తున్నది. ఈ దశాబ్దంలో యువభారతి సాహితీక్షేత్రంలో నిర్వహింపవలసిన నిర్మాణాత్మకమైన పాత్రను రూపొందించుకొనే విశిష్ట కార్యక్రమాలను చేపట్టుతున్నది. అందులో ఒకటి - రచయితలు స్వయంవ్యయంతో యువభారతి పేరుమీద ప్రచురించే గ్రంథాలను ప్రోత్సహించి, వాటిని ప్రజలకందించే సహాయసహకారాలను కలిగించటం. ఆ కార్యక్రమం క్రింద రజతోత్సవప్రచురణగా ఈ కావ్యాన్ని సాహితీలోకానికి సంతోషంతో అందిస్తున్నాం.

ఈరచన ఎన్నోవిధాలుగా గౌరవింపదగింది. ఇది కవికులగురువు కాళిదాసమహాకవి రచించిన ఋతుసంహారానికి భావానువాదం. పరిణామసుందరమైన ప్రకృతిశోభను ప్రజాజీవితానికి ప్రసాదించే కాలచైతన్యం ఋతువు. ఋతుచక్రం పరిపూర్ణానుభవాన్ని ప్రజకు అందించే జీవితవర్తులం. జీవితతత్త్వాన్ని షడ్రుతుచక్రంద్వారా ఉపాసించే అవకాశాన్ని కలిగిస్తుంది ఋతుసంహారం. భౌతికంగా గోచరించే ప్రకృతిలో ప్రతిఫలించే పురుషుడు మానవజీవితసూత్రాన్ని వ్యాఖ్యానించే తత్త్వసూత్రం. పరిణామ సుందరంగా పరిభ్రమించే ఋతుచక్రం ఒక ఇరుసును ఆశ్రయించుకొని తిరుగుతున్నదనీ, అది నిత్యమనీ, సత్యమనీ, అదే కాలపురుష తత్త్వమనీ దానిని సాహిత్యంద్వారా ఉపాసించి కవితోబాటు

సహృదయలోకంకూడా ఆత్మదర్శనం చేసుకొంటుందనీ ఋతు సంహార కావ్యం ధ్వనింపజేస్తున్నది.

శ్రీమాన్ తిరుమల దేశికాచార్యులుగారు యువభారతికి సాహితీమిత్రులు. వారి "హనుమప్పనాయకుడు" కావ్యం యువ భారతి ప్రచురణ. ఆచార్యులవారి వ్యక్తిత్వం విశిష్టమైనది. వృత్తి చేత శాస్త్రజ్ఞులు; ప్రవృత్తిచేత ఉత్తమకవులు. కెనడాలో ఉంటున్నా తనదేశాన్నీ, తనభాషనూ, తన సంస్కృతినీ, తనసాహిత్యాన్నీ మరచిపోకుండా మననంచేసుకోవటమే కాకుండా మహనీయ సాహితీప్రయోగాలు చేస్తున్న మనీషులు. ఎలక్ట్రానిక్‌యంత్ర పరిజ్ఞానంతో సాధించిన అపారశాస్త్రవిజ్ఞానాన్ని తనభాషాలిపిని యంత్రసహాయంతో ముద్రాక్షరరూపంలో మలచటానికి ప్రయ త్నించిన ప్రయోగశీలి. ఆచార్యులవారి ప్రయోగప్రవృత్తి కావ్య వస్తువులను ఎన్నుకొనటంలో ఎంత విశిష్టంగా గోచరిస్తుందో, నవీనవృత్తాలను కల్పించటంలో అంత ప్రతిభావంతంగా ప్రకా శిస్తుంది. తెలుగులో "నయాగరా", "వనప్రియ", "పరభృత" వృత్తాలు ఆచార్యులవారి అభినవసృష్టులు. తెలుగుఛందస్సులకు క్రొత్తవెలుగులు. ఋతుసంహారంలో ఆవృత్తాలను ప్రసిద్ధేతివృత్తా లతోబాటు భావానుగుణంగా ప్రయోగించి ఔచిత్యంతో బాటు, రసపోషణం కూడ చేశారు. ఈవిధంగా ఈకావ్యం అనువాదమైనా అభినవప్రయోగం.

ఆచార్యులవారు నిండుకుండ వంటివారు. సంస్కృతాంధ్ర సాహిత్యాలలో అపారపాండిత్యం ఉన్నవారు. వ్యర్థమైన ఒక పదం వాడని పొదుపరితనం వారి నైజం. శాస్త్రీయమైన ప్రయోగం వారి నియమం. కవితామయమైన భావనం వారి ప్రవృత్తి. విద్వత్తును వినయంతో అలంకరించటం వారి శీలం. దేశాభిమానం, భాషాభిమానం వారి శ్వాసకోశాలు. కవిత వారి మానసికజీవితం. వారి ఋతు సంహారం తెలుగుకవితకు మరొక వెలుగుతోరణం.

## మరొక వెలుగుతోరణం

ఈ కావ్యాన్ని యువభారతిప్రచురణగా వెలువరించడానికి దయతో నంగీకరించిన శ్రీమాన్ తిరుమల దేశికాచార్యులవారికి మాకృతజ్ఞతాభివందనాలు. సహృదయలోకం ముందు ఈ సత్కృతిని ఉంచుతున్నాం. సమాదరిస్తారని ఆశిస్తున్నాం.

హైదరాబాదు
29-12-1989

జి.వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు, యువభారతి.

# అభినందనము

భారతదేశంలో కనబడే ఆరు ఋతువుల వర్ణనలు ఒక్కచోట చేర్చి (సంహారం) రచించిన చిన్నకావ్యం ఋతుసంహారం. ఈకావ్యంలో ఆరుసర్గలూ, 144 శ్లోకాలూ ఉన్నాయి. ఇది కాళి దాసురచన కాదని కొందరి అభిప్రాయం. ఇది అతని ప్రథమరచన అయి ఉంటుందని చాలామంది అభిప్రాయం. గ్రీష్మవర్ణనతో ప్రారం భించి ఈకావ్యం వసంతవర్ణనతో సమాప్తమౌతుంది. భారతీయుల సంవత్సరం వసంతర్తువుతో ప్రారంభం అవుతుంది. అందుచేత వసంతర్తువర్ణనంతో కావ్యం ప్రారంభించడం యుక్తమైనా, ఋతు రాజమూ, అతిసుందరమూ అయిన వసంతర్తువర్ణనంతో కావ్యాన్ని ముగించటం ఔచితీసమంచితంగా ఉంటుందనే ఉద్దేశ్యంతో కవి ఆవిధంగా చేసిఉంటాడు. అందుచేతనే ఈ ఋతువును వర్ణించే సర్గలో శ్లోకాల సంఖ్య కొంచెం అధికంగా ఉంది.

ఈకావ్యంలో నాయకుడు నాయికను సంబోధిస్తూ ఆయా ఋతువుల్లో మార్పుచెందుతున్న ప్రకృతిసౌందర్యాన్ని వర్ణించి చెపుతూ ఉంటాడు. ఆయాఋతువుల్లో యువతీయువకులు ఏవిధంగా సౌఖ్యాలు అనుభవించడానికి వీలుగాఉంటుందో వర్ణిస్తాడు. ఈ విధంగా ఇందులో ప్రకృతిని చాలావరకు ఉద్దీపనగా చిత్రించడం జరిగింది. ప్రకృతిని ఉన్నదున్నట్లుగా వర్ణించడం దీనిలోని విశేషం. అత్యధికంగా అలంకారప్రయోగం గాని, మానవీకరణం గాని ఇందులో కనబడదు. అందుచేతనే దీనిని కాళిదాసు ప్రథమ రచనగా చెపుతారు. ఒకవిధంగా చూస్తే దీనిలోని ప్రకృతివర్ణన కొందరు పాశ్చాత్యకవుల ప్రకృతివర్ణనరీతిలో నడిచిందని చెప్ప వచ్చు. ఐతే నాయికానాయకోపభోగ్యత్వ వర్ణనం ఇందులో అధికం కావచ్చును.

## అభినందన

ఈ ఋతుసంహారానికి శ్రీ తిరుమల కృష్ణదేశికాచార్యులు చక్కని ఆంధ్రభాషానువాదం సమకూర్చారు. ఇది మక్కికి మక్కిగా చేసిన అనువాదం కాదు; స్వేచ్ఛానువాదం. నిజానికి ఆంధ్రభాషలో ఉన్న అనువాదకావ్యాలన్నీ స్వేచ్ఛానువాద రూపాలే. అందుచేతనే ఈ కావ్యాలను చదివే వారెవరికీ అనువాదం చదువుతున్నామన్న భావం కలుగదు. ఒక స్వతంత్రసరస కావ్యాన్నే చదువుతున్నామన్న ఆనందం వారు పొందుతారు. ఇది నన్నయాది ప్రాచీనమహాకవులు పెట్టిన ఒరవడి. దీనినే శ్రీ దేశికాచార్యులు అనుసరించారు.

మూలంలో ఉన్న మొత్తం 144 శ్లోకాలలో 82 శ్లోకాలు 11-12 అక్షరాల ఉపజాతి, వంశస్థవృత్తాలలో ఉన్నాయి. కేవలము అర్థానువాదంతో తృప్తిపడితే వీటినన్నింటినీ అనువదించడానికి తేటగీతులో ఆటవెలదులో చాలు. అప్పుడది కేవలానువాదం మాత్రమే అయిపోతుంది. కవితాసౌందర్యం కుంటువడుతుంది. అందుచేత ఉపజాత్యాది వృత్తాలను అనువదించేటప్పుడు కూడ శ్రీ ఆచార్యులుగారు పెద్ద వృత్తాలను గ్రహించారు. దీనితో కొన్ని కొత్త విశేషణాలు చేర్చడానికీ, ఉన్న అంశాన్ని విస్తృతంగా చెప్పడానికీ అవకాశం కలగడంతో రచనలో ఒక విశిష్టమైన అందం సమకూరింది. ఓజస్సనే అర్థగుణానికి నామాంతరమైన ప్రౌఢిలోని ప్రథమాంశం ఇలాంటి స్థలాలలో అత్యధికంగా కన బడుతుంది. ఒక్కపదంలో చెప్పగలిగిన అర్థాన్ని వాక్యంలో (అనేకపదాలలో) చెప్పడం అనేది ఆ అంశం. మూడవ అంశమైన వ్యాసంకూడా కొన్నిచోట్ల చోటు చేసుకొన్నది.

> "పదార్థే వాక్యరచనం, వాక్యార్థే చ పదాభిధా,
> ప్రౌఢిర్వ్యాససమాసౌచ, సాభిప్రాయత్వ మేవచ."
>
> – కావ్యాలంకారసూత్రాణి 3.2.2

## అభినందన

విషయప్రధానమైన గ్రంథాల అనువాదాలలో ఇలాంటి వాటికి అవకాశం ఉండదు. భగవద్గీత, భర్తృహరిసుభాషితాదులను అనువదించే వారికి స్వాతంత్ర్యం తక్కువ ఉంటుంది. కథావర్ణనాది ప్రధానమైన రచనలు అనువదించేటప్పుడు ఇలాంటి స్వాతంత్ర్యాన్ని ఎంతైనా చూపించవచ్చు. అది చూపించినకొలదీ కవితా సౌందర్యం ఇనుమడించి ఆ అనువాదరూపకావ్యంకూడా స్వతంత్ర కావ్యంవలె భాసిస్తూ పఠితలకు ఆనందాన్ని కలిగిస్తుంది. శ్రీ ఆచార్యులుగారి అనువాదం ఏతద్గుణభరితం కావడంచేత ప్రారంభం నుండి చివరివరకూ చాలాచక్కగా సాగింది. ఉదాహరణకు రెండుమూడు పద్యాలు:

శ్లో. సువాసితం హర్మ్యతలం మనోహరం
ప్రియాముఖోచ్ఛ్వాసవికంపితం మధు,
సుతంత్రిగీతం మదనస్య దీపనం
శుచౌ నిశీథేఽనుభవంతి కామినః.

దీని అనువాదం ఎంత అందంగా ఉన్నదో చూడండి:

చ. అతులసుగంధిశీతలసుహర్మ్యతలంబులు, ప్రేయసీముఖో
దితమృదువాతధూతమగు తీయనిమద్యము, చారువల్లకీ
రతిహితనిస్వనానుకృతరమ్యగళారవముల్, నిశీథపుం
దతుల నిదాఘమందుఁ బ్రమదంబును గూర్చును కామికోటికిౝ.

పైపద్యంలో దీర్ఘసమాసాలున్నా శబ్దజ్ఞానం కలవారికి అర్థంగాని సమాస మొక్కటీ లేదు.

## అభినందన

ఈ క్రింది పద్యంలో చిన్నచిన్నపదాలతో నిదాఘతప్తమైన సర్పం పాట్లు ఎంతచక్కగా వర్ణింపబడ్డాయో చూడండి.

శ్లో. రవేర్మయూఖైరభితాపితో భృశం
విదహ్యమానః పథి తప్తపాంసుభిః,
అవాఙ్ముఖో జిహ్మగతిశ్శ్వసన్ ముహుః
ఫణీ మయూరస్య తలే నిషీదతి.

చ. ఖరకరతీక్ష్ణతాపమున గాలఁగ మేనులు పాఱుచున్ ఫణుల్
సరణుల నుష్ణపాంసువుల సంగతి నింకను గాలి, యూర్చుచు
న్నతిమతి, వక్రమౌనడలు, నమ్రములౌ వదనంబు లేర్పడన్,
సరగున నెమ్మిపించియపుఁజాయలఁ దూరుచు విశ్రమించెడిన్.

వసంతాగమం చూచి, విరహార్తుడైన పాంథుని అవస్థను వర్ణించే ఈక్రింది శ్లోకానికి అనువాదం ఆ పాంథుని చిత్రాన్ని మన మనో నేత్రం ముందు ఉంచేవిధంగా నడిచింది.

శ్లో. నేత్రే నిమీలయతి రోదితి యాతి శోకం
ఘ్రాణం కరేణ నిరుణద్ధి విరౌతి చోచ్చైః,
కాంతావియోగ పరిఖేదితచిత్తవృత్తిః
దృష్ట్వాఽధ్వగః కుసుమితాన్ సహకారవృక్షాన్.

చ. నయనముల న్నిమీలనమొనర్చును, బొందు నితాంతశోకమున్,
శయమున మూయు ఘ్రాణమును, సార్తిగ నార్చునుబిట్టుబిట్టుగన్,
ప్రియ నెడఁబాసి లోన దురపిల్లెడు పాంథుఁడు పుష్పపల్లవ
ప్రయుతయువామ్రవాటికల వైభవముం గనలేక యుత్తరిన్.

## అభినందన

అనేకప్రసిద్ధవృత్తములను భావానుగుణంగా ఉపయోగించడమే కాకుండా, నయాగరా, వనప్రియ, పరభృతములనే నూతనవృత్తాలను సృష్టించడం శ్రీ ఆచార్యులవారి ప్రతిభను చాటుచున్నది.

"రంతు సేయుచు, జాతవిభ్రమరయముచేతఁ గలంగుచున్,
ప్రాంతసంస్థితపాదపంబుల వడిగఁ గూల్చుచు, దుష్టలా
కాంతలట్టు లశుద్ధజీవనకలితలౌచు సముద్రమన్
కాంతుఁ గూడఁగనేగు సంరయగతుల నిమ్నగ లిత్తరిన్."

వనప్రియవృత్తంలోనున్న ఈ పద్యం చదువుతూన్నపుడే నదీ ప్రవాహచాంచల్యం, దష్టవనితాస్వభావచాపల్యం పఠితకు అనుభవగోచరం అవుతున్నవి. మూలంలోని "అనిర్మలైః సలిలైః", "నద్యః" అనేవాటికి "అశుద్ధజీవనకలితలౌచు", "నిమ్నగలు" అనే పర్యాయ పదాలు ప్రకృ తార్థానుగుణంగా ఉన్నవి.

కొన్నిచోట్ల నాతిదీర్ఘసమాసమైన పాంచాలీరీతినీ, అత్యధికంగా వైదర్భీరీతినీ అనుసరిస్తూ, అర్థానుగుణమైన శబ్దచయనంతో చక్కగా సాగిన శ్రీ ఆచార్యులుగారి ఈ అనువాదం, చెపితేకాని అనువాదం అని తెలియకపోవడంచేత ఒక స్వతంత్రమధుర కావ్యఖండికగా సరసుల హృదయాలను ఆవర్జిస్తుందనే విషయంలో సందేహం లేదు.

పుల్లెల శ్రీరామచంద్రుడు
సంస్కృతాచార్యులు
ఉస్మానియావిశ్వవిద్యాలయము .

హైదరాబాదు
18-12-1989

# ఆలోకనము

అపారకవిపరంపరావాహినైన ప్రపంచంలో కాళిదాసప్రభృతు లిద్దరో ముగ్గురో కవులుగా పరిగణింపదగినవారని ఆనందవర్ధనా చార్యులు ధ్వన్యాలోకంలో స్పష్టంచేసినారు. వ్యాస వాల్మీకి కాళి దాసులే సంస్కృతభారతిని అజరామరంగా ప్రతిష్ఠించినారు. వాల్మీకిరామాయణం, వ్యాసభగవద్గీత, కాళిదాసరఘువంశం భార తీయజీవన సంస్కృతికి ఆధారశిలలుగా నిల్చినాయి.

జీవితాన్ని సమగ్రంగా దర్శించిన కవితాతపస్వి కాళిదాసు. ఆయన నాటకాల్లోని నాందీశ్లోకాలను, శాకుంతలంలోని భరత వాక్యాన్ని మననంచేస్తే ఆయన తత్త్వం స్ఫురిస్తుంది. ఆనందాన్ని, సౌంద ర్యాన్ని, జీవన్మృతి రహస్యాన్ని, మోక్షపర్యవసానపథాన్ని తనకావ్యాల్లో సున్నితంగా నిర్దేశించిన మహాకవి.. ఆయన కుమార సంభవ, రఘువంశ కావ్యాలు మల్లినాథ వ్యాఖ్యా భూషితాలై సహృ దయలోకానికి సర్వదా శిరోధార్యములైనాయి. "మేఘసందేశం" సుకుమారమైన రచన. "ఋతుసంహారం" ప్రకృతి సౌందర్యాన్ని యథాతథంగా విలోకించి, తన్మయించెంది, రూపొందించిన లలిత మైన కావ్యం. కావ్యశైలిని పరిశీలిస్తే ఋతుసంహారం కాళిదాసకృత మేనని నిస్సందేహంగా తెలుస్తుంది. సంస్కృతభాషాపరిచయం కలి గినవారికి ఋతుసంహారంశ్లోకాలు అమృతతుల్యంగా ఉంటాయి. మహాకావ్యాలు సవ్యాఖ్యానంగా చదివి కాళిదాస కవితా హృద యాన్ని సాక్షాత్కరించుకోగల్గినవారు, అందుకై తగిన విశ్రాంతి, ఉత్సుకత ఉన్నవారు కరువైపోతున్నారు. కవితాసౌందర్యాన్ని నిరపేక్షంగా ఆనందించ గలిగినవారికి "ఋతుసంహారం", "మేఘ సందేశం" ఆ అవకాశాన్ని కలిగిస్తాయి. "సుకవితా యద్యస్తి రాజ్యేన కిం" అన్న వాక్యాన్ని అర్థవంతం చేస్తాయి. ఋతుసంహార కావ్యాన్ని శ్రీరంజిత్‌పండిట్ ఆంగ్లంలోకి అనువదించినారు. భార తీయభాషల్లో దీని అనువాదాలు చాలా ఉన్నాయి. తెలుగులోకూడ

నాలుగైదనువాదాలు ప్రచారంలో ఉన్నాయి. మిత్రులు డా. కిషన్ రావుగా రిటీవలే దీన్ని అనువదించి ప్రచురించినారు.

అన్నిటికంటె నూతనమైనది, కొన్ని లక్షణాలవల్ల విశిష్టమైనది డా. దేశికాచార్యులవారి ఆంధ్రీకరణం. డా. దేశికాచార్యులు సంస్కృత కావ్యాలనూ, ఆంధ్ర ప్రబంధాలనూ, సవ్యాఖ్యానంగా సంప్రదాయబద్ధంగా అధ్యయనం చేసినారు. వేదాన్ని నిష్కారణంగా అధ్యయనం చేయవలసిందని శ్రుతి ఆదేశిస్తుంది. వేదాన్నీ, సంస్కృత కావ్యాలనూ, కేవలం ధార్మికజిజ్ఞాసతో, కావ్యసౌందర్యదిదృక్షతో వృత్తిరీత్యా కంప్యూటరుసైంటిస్టుగా కెనడాదేశంలో నివసిస్తున్న శ్రీ ఆచార్యులుగారు నిజంగా "నిష్కారణంగా" అధ్యయనం చేసినారు. శ్రీ ఆచార్యుల వారితో నాకు లేఖామాత్ర పరిచయమే. ఉత్తర ప్రత్యుత్తరాలతోనే వారి హృదయసంస్కారం నా మనస్సుకు హత్తు కొన్నది. ఆ సౌజన్యం మూలంగానే నేని నాలుగుమాటలు వ్రాస్తు న్నాను. శ్రీ ఆచార్యులవారి పాండిత్యం గొప్పది. నాకు కలిగిన సంస్కృతభాషాపరిచయం "విబుధ జనులవలన విన్నంత" స్వల్పమే. వారిమైత్రీబంధం నా అనర్హతను విస్మరించేట్టు చేసింది.

శ్రీ దేశికుల అనువాదం మృదువైనది. ఋతుసంహార శ్లోకాలను శ్రవణ మనన నిదిధ్యాసనాదులతో స్వాయత్తం చేసికొంటేనే తప్ప ఇటువంటి అనువాదం సాధ్యంకాదు. శ్రీ దేశికులు కొన్ని నూతన ఛ్ఛందఃప్రయోగాలను చేసినారు. వాటిని వారు ముందే వివరించి నారు. తెనుగుపదజాలంపై శ్రీ దేశికులు మంచి అధికారం సంపా దించినారు. సంస్కృతసమాసగ్రథనం కూడా నిష్ప్రయత్నంగా సాగింది. తెలుగూ, సంస్కృతం బాగా తెలిస్తేనే కాదు, చక్కని పద్య రచన కూడా దానికి తోడుకావాలి. శ్రీ దేశికుల పద్యరచనను పరిశీలిస్తే వారి నైపుణ్యం బోధపడుతుంది.

## ఆలోకనము

ఏ సంస్కృత కావ్యాన్నైనా అనువదించడం కష్టం. కాళిదాస కావ్యాలను అనువదించడం మరీ క్లిష్టమైన పని. సంస్కృతంలోనే వాటిని చదివి ఆనందించ గలిగినవారు అనువాదాల విషయం పట్టించు కోరు. ఏనుగు లక్ష్మణకవివంటి మహానుభావు డెవడోకాని అరుదుగా కన్పిస్తాడు. ఆయన భర్తృహరి త్రిశతి అనువాదం నిరుపమానమైనది. కాని అనువాదాలు లేకుండా ఉండలేం కూడా. భారతీయ కావ్య సంప్ర దాయభూమిక భారతీయభాషలన్నింటికీ సమానం కావడం చేత ఆయా భాషల్లోనికి సంస్కృతాన్ని అనువదించడం కొంచెం సులువు. ఇంగ్లీష్ వంటి పాశ్చాత్యభాషల్లో సంస్కృతశబ్దమార్దవం ఏంచేసినా సాధ్యం కాదు. శ్రీ దేశికులు తెలుగు అనువాదంలో తమ ఆంధ్రకావ్యపరిచితిని గుబాళించినారు:

"తుషారసంఘాతనిపాతశీతలాః,
శశాంకభాభిః శిశిరీకృతాః పునః,
విపాణ్డుతారాగణ జిహ్మభూషితాః,
జనస్య సేవ్యా నభవంతి రాత్రయః"

"అమలిన తారకా సముదయంబుల సుందర జిహ్మరూప చం
ద్రమణము నర్థి నెవ్వరును గానరు, మున్నె ప్రశీతలంబులై
హిమమున, నాపయిం బ్రకటితేందుకరంబుల నింకఁ జల్లనై
ప్రమదము గూర్పకున్న శిశిరర్తువు నందలి దీర్ఘరాత్రులన్."

"అమలినతారకాసముదయంబుల" అన్న సమాసంలో ఆంధ్ర కవిత్వ మంగళాచరణం, నన్నయభట్టారక శైలీగాంభీర్యం మనస్సు నాకట్టు కుంటాయి.

మూలంలోని

## ఆలోకనము

"ఆదీప్తవహ్నిసదృశై ర్మరుతావధూతైః,
సర్వత్ర కింశుకవనైః కుసుమావనమ్రైః,
సద్యో వసంతసమయే హి సమాచితేయం,
రక్తాంశుకా నవవధూరివ భాతి భూమిః"

(మోదుగులు పూచి నిప్పుకణికల్లా ఉన్నాయి. ఆపూలే ఎఱ్ఱని చీర లాగా ఉండగా, భూదేవి నవవధువులాగా వెలుగుతున్నది) అనే శ్లోకానికి శ్రీ దేశికుల అనువాదం:

"కాఱువులఁ బోలె నెఱ్ఱనగు కోమలపుష్పముల న్నతంబులై,
కఱువలిచేత మందముగఁ గంపిలు కింశుకవృక్షరాజిచేఁ
బరఁగుచు భూమి యామనిని భాసిలుఁగాదె, నవారుణాంశుకా
వరణము బూని వ్రీడమెయి వచ్చెడు పెండిలికూతురుంబలెన్."

"వ్రీడమెయి వచ్చెడు పెండిలికూతురుంబలెన్" అని కూర్చుట అందంగా ఉన్నది. మూలంలోని శ్లోకం చమత్కారంగా లేకుంటే ఈక్రింది అనువాదంలో దానికో క్రొత్తమలుపును తెచ్చినారు:

"తనూని పాండూని సమంథరాణి,
ముహుర్ముహుర్జృంభణతత్పరాణి,
అఙ్గాన్యనఙ్గః ప్రమదాజనస్య,
కరోతి లావణ్యససంభ్రమాణి"

"తనుతన్, బాండురతన్, జృం
భణతత్పరతన్, మనోజమదజాలసతన్,
ఘనలావణ్యవిజృంభణఁ
గని భోగ్యములయ్యె నేడు కాంతలతనువుల్."

అనే అనువాదం దీనికి రమణీయంగా సాగింది. శ్రీ దేశికుల అనువాద గాంభీర్యానికి ఈక్రింది శ్లోకానువాదాన్ని పరిశీలించ వచ్చును.

"ప్రభిన్నవైడూర్యనిభై స్తృణాంకురైః,
సమాచితా ప్రోత్థితకందళీదళైః,
విభాతి శుక్లేతరరత్నభూషితా,
వరాఙ్గనేవ క్షితి రిన్ద్రగోపకైః."

దీనికి అనువాదపద్యంః

"అల వైడూర్యపు జీర్ణకాంతులకుఁ దుల్యంబైన ఘాసాంకురం
బులచేఁ, బ్రోత్థితకందళీదళముచేఁ, బొల్పారు నారుద్రపు
ర్వులచే నావృతమైన ధాత్రి యలరారుం గౌరవర్ణేతరో
జ్జ్వల రత్నాభరణాంచితాంగియగు యోషారత్నముంబోలుచున్."

ఈవిధంగా ఎన్నో పద్యాల నుదహరించవచ్చు. గ్రంథాన్ని చదివే రసికులకు శ్రీదేశికుల అనువాదసౌందర్యం హృదయావర్జకంగా ఉంటుందనడంలో సందేహంలేదు. ఏదో దిక్సూచిగా, స్వీయచాపల్య ప్రదర్శకంగా ఈ నాలుగు మాటలను వ్రాసినాను. నిర్హేతుకంగా నాకీ గౌరవాన్ని ఆపాదించిన శ్రీ దేశికులకు కృతజ్ఞుణ్ణి.

శ్రీలక్ష్మణమూర్తి
కాకతీయ విశ్వవిద్యాలయము.

వరంగలు
28–2–1990

# ప్రస్తావన

ఇది నా మూఁడవకావ్యము. నా యితరకావ్యములు హనుమప్పనాయకుఁడు, అశ్రుమాల యనునవి. సంవత్సరము క్రిందట నేను మాసమీపనగరమైన విన్నిపెగులో కొంద ఱౌత్సాహికులకు ప్రాథమికసంస్కృతబోధనము చేయఁ గడంగితిని. ఇది కొనసాగలేదు కాని కొనసాగినంత మేఱకు కాళిదాసు ఋతుసంహారములోని కొన్ని శ్లోకములను విద్యార్థులకు వివ రించితిని. ఈరూపమున నాకుఋతుసంహారముపై ప్రత్యేకాభిమాన మేర్పడి, దానిని తెలుఁగులోనికి పరివర్తింపవలెనను కుతూహలము రేకెత్తెను. ఆ తర్వాత కొన్నిరోజులకే అనువాద మారంభించి 4 నెలలలో పూర్తిచేసితిని. నేను పూర్తిచేసిన తర్వాత ఋతుసంహారమున కిదివఱకే ఆంధ్రానువాదము లున్నట్లు తెలియ వచ్చెను. కాని అవియేవియు నాకు కెనడాదేశములో ఉపలభ్యములు కాలేదు. అందుచేత నేను వాటిని చూడలేదు. వాటికంటె నా యనువాదము న్యూనముగా నున్నదో అతిశయముగా నున్నదో నాకుఁ దెలియదు. ఈ నిర్ణయమును పాఠకవిమర్శకులకే నేను వదలివేయు చున్నాను.

నేను రెండు ఋతుసంహారప్రతులను మూలముగా గైకొంటిని. ఒకటి వావిళ్లవారు తెలుఁగువ్యాఖ్యానముతో బ్రచురించినది. రెండవది మోతీలాల్ బనార్సీదాస్‌వారు నాగరలిపిలో బరోడా పండితులు శ్రీమాన్ వేఙ్కటాచార్యులవారి టీకతో ప్రచు రించినది. ఇది శ్రీ పి.వి. కాళేపండిత పరిష్కృతము. వావిళ్లవారి ప్రతికంటె ఈప్రతి ప్రశస్తముగా నున్నది. పాఠభేదములున్న సందర్భములలో నీ రెండవ ప్రతిలోనే హితమగు పాఠములు సూచితమైనవి. వానినే చాల సందర్భములలో నేను గ్రహించితిని.

# ప్రస్తావన

అనువాదవిషయములో మహాకవి శ్రీనాథదర్శిత భావాను వాదపద్ధతినే నే నవలంబించితిని. నన్నయాదుల కథానువాద పద్ధతికంటె, ఆధునికుల ప్రతిపదానువాదపద్ధతికంటె భావానువాద పద్ధతియే కావ్యానువాదముల కుపాదేయమైనదని నా యభిప్రాయము.

మూలఋతుసంహారములో ననేకపదబంధములు, భావములు పలుమార్లు పునరుక్తములైనవి. బాల్యకావ్యమగుటచే కాళిదాసిట్టి పున రుక్తిదోషముల కోర్చియుండవచ్చునని విమర్శకుల యూహ. కాని అను వాదములో నేను పదబంధపునరుక్తిని సాంతముగానే పరిహరించితిని. అనువాదకావ్య మగుటచే భావముల పునరుక్తిని నివారింపలేనైతిని.

ఈకావ్యములో భావానుగుణముగ నే ననేకవృత్తములను వాడియున్నాను. సుప్రసిద్ధములైన గీత సీస కందోత్పల చంపక తరల మత్తేభ శార్దూల మత్తకోకిల వృత్తములనేకాక స్వకల్పితమైన నయాగరా, వనప్రియ, పరభృతవృత్తములనుకూడ వాడి యున్నాను. ఇందు నయాగరావృత్తమును నేనిదివఱకే హనుమప్ప నాయకకావ్యములో విస్తృతముగా వాడియున్నాను. ఇది మసజస రర గణములతోఁ గూడి, 12వ అక్షరము యతిగా గల్గిన వృత్తము. గతిలో నిది శార్దూలమువలె నుండును. ఇక వనప్రియ, పరభృత వృత్తముల గతి మత్తకోకిలవలె నుండును. మాత్రాచ్ఛందోరీత్యా వనప్రియ, పరభృత, తరల, మత్తకోకిల వృత్తములు మిశ్రగతిలో నడచు తుల్యచ్ఛందములు. కాని అక్షరగణరీత్యా మత్తకోకిల 18వ ధృతిచ్ఛందస్సునందును, వనప్రియతరలములు 19వ అతిధృతి చ్ఛందస్సునందును, పరభృతము 20వ కృతిచ్ఛందస్సునందును జనించినవి. యథార్థస్థితిలో వనప్రియవృత్త మంత క్రొత్తేమికాదు. పొత్తపి వేంకటరమణకవికృతమైన లక్షణశిరోమణిలో చిరుదాంక

మను అర్థసమవృత్త ముదాహృతమైనది. ఇందులోని ప్రథమ తృతీయపాదములు వనప్రియవృత్త పాదములే.

ఇక నీకావ్యమును సమీక్షించి వ్రాతప్రతిలోని దోషముల నెత్తి చూపినవారికి నాకృతజ్ఞతలు తెల్పుకొందును. వీరిలో ముఖ్యులు శ్రీమాన్ టి. వేంకటాచార్యులుగారు (సంస్కృతాచార్యులు, టొరంటో విశ్వవిద్యాలయము, కెనడా), శ్రీమాన్ వి. కృష్ణమాచార్యులుగారు (ఆంగ్లాచార్యులు, కార్లటన్‌విశ్వవిద్యాలయము, కెనడా), శ్రీలక్ష్మణమూర్తిగారు (ఆంగ్లాచార్యులు, కాకతీయవిశ్వ విద్యాలయము, వరంగలు), పండిత శ్రీమాన్ రఘునాథాచార్యులు గారు (వరంగలు), శ్రీ రామకృష్ణరాయణంగారు (వరంగలు), శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు (సంస్కృతాచార్యులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు). వీరందరికి నా హృదయ పూర్వక నమోంజలులు.

వనపర్తినగరములో తల్లివలె నొద్దనుంచుకొని, ఉన్నతపాఠ శాలాంతము విద్య గరపించిన సాధ్వి, కీర్తిశేషురాలగు మా మేనత్త పునహారంగమ్మగారికి నీకావ్యమును నిరంతరస్మారకచిహ్నముగా నంకితము చేయుచున్నాను.

పినవా,
మానిటోబా, కెనడా
నవంబరు, 1989.

ఇట్లు
బుధజనవిధేయుఁడు
తిరుమల కృష్ణదేశికాచార్యులు

***********
*******************
***********

# స మ ర్ప ణ

తే.గీ. అమరధునిలోని తమ్ముల యంద మరయు
కమల ముఖమును మేలగు కమల మనుచు
మూఁగు తేఁటుల వారించు మోక్షదుండు
కామితమ్ము లొసఁగుత లోకమ్ములకును.

పరభృతము. ప్రజలనాల్కలె వ్రాతపల్కలు, ప్రణవనాదమె నాదమై,
అజునియంకమె భద్రపీఠము, యతులచిత్తమె గేహమై,
వృజినబుద్ధులె బద్ధశత్రులు, విశదహంసమె తేజియై,
సుజనవృత్తులె వృత్తులై తగు సుదతి భారతిఁ గొల్చెదన్.

సీ. అబ్జతారాంకితంబగు జ్యోతిషం బిందు
హారమై యెవతె కింపారుచుండు
సంగీతసాహిత్యసారంబె కర్ణికా
యుగళమై యేకాంత కొనరుచుండు
మాత్రాక్షరాత్మకమంజువృత్తంబు లే
యింతికిం గాజులై యెసఁగుచుండు
బహువిధాలంకారపాకరీతులె రంగు
టలరులై యేదేవి కలరుచుండు

తే.గీ. అట్టి యాగమత్రయవళి, నబ్జభవుని
రాణి, వాణిఁ, బుస్తకపాణిఁ బ్రస్తుతింతు,
నాదు జిహ్వాగ్రమున సదా నాట్యమాడి
మధురకవితలఁ బల్కింపు మనుచుఁ గోరి.

తే.గీ. అనుచు నిష్టదైవంబుల కంజలించి,
అంకనము సేతు మాదు మేనత్త నిపుడు
ఎవతె కీ కావ్యరత్నంబు నిచ్చికొందు,
నా భవంబుఁ గృతార్థ మొనర్చికొందు.

## సమర్పణ

కం. అల గద్వాలపురంబున
నలరెఁ జెట్లూరి వేంకటార్యుం డనఘుం
డలఘుతరాగమశాస్త్రక
మలవనవిహారణచణుండు మహిమాన్వితుఁడై.

కం. కౌశికగోత్రోద్భవుఁడై
వాసింగాంచె నతఁడెంతొ పండితసభలన్
నైశవిహాయసవీథిన్
భాసురుఁడై పాత్రుఁడైన వలివెల్గువలెన్.

తే.గీ. అతని కొందవిరి ముగ్వురు సుతులు, హితులు;
అందు రాఘవాచార్యుండు ముందుఁ గలిగె,
పిదప శ్రీనివాసాచార్యుఁ డొదవియుండె,
తుదకు నారాయణాచార్యుఁ డుదయమొందె.

తే.గీ.. తర్కవేదాంతములయందుఁ దనకుఁదానె,
భవ్యసాహిత్యపాండితిం బదులులేదు,
వ్యాకరణవైష్ణవంబుల వాదులేదు,
నాఁగ నొప్పెను నారాయణాఖ్యుఁ డిలను.

తే.గీ. పగటిదివిటీలు వెలుగంగఁ, బంట్లు బొడ,
శిబికయందు నూరేగించెఁ జెలువుమీర,
సురపురాస్థాననాథుఁడా సూరి పాండి
తికి విముగ్ధుఁడై, వినతుఁడై సకులతోడ.

తే.గీ. పూని వనపర్తిగద్వాలభూమిపతులు
సత్కృతునిజేసి రాతని సంతసమున,
అర్చనీయులు పండితు లఖిలజగతి,
సకలలోకార్చితుండైన సవిత పగిది.

## సమర్పణ

కం. వేదంబుల, బుధపరిష
ద్వాదంబుల, సంస్కృతాంధ్రభాషలయందుం
దాఁదగె బుధుఁడై, యాతని
సోదరుఁడా శ్రీనివాససూరి ధరిత్రిన్.

తే.గీ. అతఁడు దత్తుఁడయ్యె హరితసాన్వయుండు,
కొండనాగులగ్రామాన నుండువాఁడు
నైన పాపయాచార్లకు సూనుఁడగుచు,
దాన వీడె నాతఁడు గద్వాలపురము.

తే.గీ. అతఁడు వేంకటలక్ష్మమ్మ యనెడు సాధ్విఁ
బరిణయంబాడి శ్రీకాంతు కరుణచేత
ముందుగాఁబొందె నొకసుత న్ముదముమీర,
పైని ముప్వురు పుత్త్రిలం బడసి వెలసె.

తే.గీ. పరఁగు శ్రీరంగనాథుని విరులమాల
చంద మందమైయున్న జ్యేష్ఠాత్మజాత
కాతఁ డొసఁగెను రంగనాయకియనం బ
రంగు భవ్యనామంబు సంరంభ మెసఁగ.

తే.గీ. పుత్త్రిలందుఁ బాపాచార్లు బుట్టె మొదట,
పైని వేంకటనాథుండు ప్రభవమొందె,
పిదప రామతాతాచార్యుఁ డుదయమొందె,
అతఁడె మజ్జనకుండు, విఖ్యాతయశుఁడు.

తే.గీ. అట్లు మత్పితృసోదరి యగుట కతన
నాకు మేనత్తయౌ రంగనాయకమ్మ,
ప్రథితగుణముల కాయమ పట్టుఁగొమ్మ,
పూర్ణకారుణ్యమున కామె పూతరెమ్మ.

## సమర్పణ

కం. పునహావంశశశాంకుఁడు,
వనపర్తినివాసి, తర్కపండితవరుఁడై
తనరెడు నరసింహార్యుఁడు
మనమలరఁగఁ బెండ్లియాడె మామేనత్తన్.

తే.గీ. కాని నిస్సంతువై కొంతకాలమునకు
మరణమొందె నాతఁడు విధికరుణ లేమి,
అత్తయొక్కతె వనపర్తియందుఁ జిక్కె,
విధుని బాసిన తారకావిధము దోఁప.

కం. పిదపం గొన్నేండ్లకు నను,
మదగ్రజుని, మద్భగినిని, మాతయు నాగఱ
ముదమారఁగ నాయమ నిజ
సదనంబున నిడుకొని మముఁ జదువఁగఁజేసెఱ.

తే.గీ. ప్రైమరీస్కూలు మొదలుగాఁ బదవకక్ష్య
వఱకు నన్నామె చదివించెఁ గరుణతోడ,
ఆమె యౌదార్యమున కిల హద్దులేవి?
ఆకసంబున కరయంగ నంచులేవి?

తే.గీ. ఆమె పెట్టిన భిక్షయే యగును సుమ్ము
నాదు సత్ప్రవర్తన, నాదు జ్ఞానమెల్ల,
ఆమె వెలిగించె నారనియట్టి జ్యోతి
సంతమసపూర్ణమౌ నాదు స్వాంతమందు.

ఉ. చిన్నటినాఁటినుం డిటులు చిక్కనిప్రేముడిఁ జేరఁదీసి, తా
నున్నతపాఠశాలవఱ కొప్పెడు విద్యఁ గఱంపఁజేసి, నా
యున్నతి కిక్కయైన కరుణోల్లసితాకృతి మేనయత్తకున్
సన్నుతశీలకు న్నిరతసంస్మృతిచిహ్నముఁ గూర్చువాఁడనై.

## సమర్పణ

తే.గీ. సంస్కృతంబునఁ గాళిదాసకృతమైన
శ్రావ్యమగు ఋతుసంహారకావ్య మేను
తెల్గునంగూర్చి యామె కాదృతి దలిర్ప
నంకితమొనర్చి స్మరియింతు నాత్మలోన.

తే.గీ. అమ్మ! రంగమ్మ! కొనుమమ్మ యాదరమున!
భవ్యగీర్వాణభాషాదివ ప్రవర్ధి
తఋతుసంహారపారిజాతమ్ముఁ దెచ్చి
నీదుముంగిట నిల్పితి నేఁడు వేడ్క!

కం. రంగమ్మాఖ్యకుఁ, ఋనహా
వంగడమునకున్ స్నుషయయి వఱలిన సతికిన్,
శృంగారమూర్తికిని, శ్రీ
రంగేశ్వరభజనతత్పరానఘమతికిన్.

కం. కరుణాంచితకున్, నిస్తుల
తరవైష్ణవధర్మవర్తితహృదంచితకున్,
వరవనపర్తిపురీశ్వర
కరుణాలబ్ధాగ్రహారకమలాంచితకున్.

కం. శాంతస్వరూపిణికిని, ని
తాంతసుకృతరూపిణికిని, ధర్మాకృతికిన్,
స్వాంతామలతాఖనికిని,
సంతోషప్రదమధురవచఃకళానిధికిన్.

కం. స్మారకచిహ్నముగాఁగ న
పారంబగుభక్తి నేను బలికెడు ఋతుసం
హారంబున కగు నీగతి
ప్రారంభము భారతీకృపాభోగముచేన్.

# గ్రీష్మర్తువు

శ్లో. ప్రచండసూర్యః స్పృహణీయచంద్రమాః
సదావగాహక్షమవారిసంచయః,
దినాంతరమ్యోఽభ్యుపశాంతమన్మథో
నిదాఘకాలోఽయముపాగతః ప్రియే.

మ. హరిదశ్వుండు ప్రచండుఁడయ్యె, విధుఁడత్యంతేప్సితుండై తగెన్,
నిరతంబున్ సుఖగాహనక్షమములై నీరంబు లింపారె, శం
బరవైరిప్రసభం బొకింత సడలెన్, భవ్యంబులై సంధ్యలుం
బరగెం, బర్వ నిదాఘకాల మిలలోఁ బద్మాక్షి వీక్షించితే!

శ్లో. నిశాశ్శశాంకక్షతనీలరాజయః
క్వచిద్విచిత్రం జలయంత్రమందిరం,
మణిప్రకారాః సరసం చ చందనం
శుచౌ ప్రియే యాంతి జనస్య సేవ్యతామ్.

ఉ. సంతమసాపహంబులయి, చల్లనివై తగు సాంద్రచంద్రికల్
వింతగు నీటియంత్రముల వెల్వడు బిందులఁ జల్లనైన వే
శ్మాంతరముల్, సురత్ననిచయంబులు, చందనపంకముల్, తప
శ్శ్రాంతజనాళికిం దగు సుసౌఖ్యకరంబులునౌచు నిత్తరిన్.

# గ్రీష్మర్తువు

శ్లో. సువాసితం హర్మ్యతలం మనోహరం
ప్రియాముఖోచ్ఛ్వాసవికంపితం మధు,
సుతంత్రిగీతం మదనస్య దీపనం
శుచౌ నిశీథేఽనుభవంతి కామినః.

చ. అతులసుగంధిశీతలసుహర్మ్యతలంబులు, ప్రేయసీముఖో
దితమృదువాతధూతమగు తీయనిమద్యము, చారువల్లకీ
రతిహితనిస్వనానుకృతరమ్యగళారవముల్, నిశీథపుఁ
దతుల నిదాఘమందుఁ బ్రమదంబును గూర్చును కామికోటికిన్.

శ్లో. నితంబబింబైః సుదుకూలమేఖలైః
స్తనైః సహారాభరణైః సచందనైః,
శిరోరుహైః స్నానకషాయవాసితైః
స్త్రియో నిదాఘం శమయంతి కామినామ్.

చ. పలుచని పట్టుపావడలు, బంగరుపేఁటలు గల్గు శ్రోణులున్
మలయజపంకలేపములు, మౌక్తికహారము లొప్పు చన్నులున్
నలుఁగు లలంది తానము లొనర్ప సువాసితమైన కేశముల్
చలువలు గూర్పఁ గామినుల సంగతిఁ బొతురు వెట్టఁ గాముకుల్.

శ్లో. నితాంతలాక్షారసరాగరంజితై
ర్నితంబినీనాం చరణైః సనూపురైః,
పదేపదే హంసరుతానుకారిభి
ర్జనస్య చిత్తం క్రియతే సమన్మథమ్.

తే.గీ. పదపదంబున హంసల నదములూను
హంసకంబుల నందమై, యావరసము
చేత నరుణంబులైయున్న స్త్రీలపదము
లతనుసందీపన మొనర్చు నభికతతికి.

# గ్రీష్మర్తువు

శ్లో. పయోధరా శ్చందనపంకచర్చితా
స్తుషారగౌరార్పితహారశేఖరాః,
నితంబదేశాశ్చ సహేమమేఖలాః
ప్రకుర్వతే కస్య మనో న సోత్సుకమ్.

తే.గీ. అతులహిమగౌరహారాంచితాగ్రములును,
చందనవిలిప్తములునైన చన్నుఁగవలు,
స్వర్ణకాంచీయుతనితంబచక్రములును,
సంతసముఁగూర్ప వెవ్వాని స్వాంతమునకు?

శ్లో. సముద్గత స్వేదచితాంగసంధయో
విముచ్య వాసాంసి గురూణి సాంప్రతం,
స్తనేషు తన్వంశుక మున్నతస్తనాః
నివేశయంతి ప్రమదా స్సయౌవనాః.

తే.గీ. అంగసంధులఁ జెమటనీ రలముకొనఁగఁ
దాళఁజాలక గుర్వంశుకాళిఁ జార్చి,
అతులతన్వంశుకంబుల నడ్డగింత్రు
చొచ్చుకొనివచ్చు చన్నులన్ సుదతు లిపుడు.

శ్లో. సచందనాంబువ్యజనోద్భవానిలైః
సహారయష్టిస్తనమండలార్పణైః,
సవల్లకీకాకలిగీతనిస్వనై
ర్విబోధ్యతే సుప్త ఇవాద్య మన్మథః.

ఉ. చందనవారిసిక్తమగు చల్లసురంటులఁ బుట్టు వాతముల్,
సుందరతారహారముల శోభిలు గుబ్బల కౌఁగిలింతలున్,
మందవిపంచికారవసమన్వితమంజులగీతమాలికల్,
డెందములందు మేల్కొలుపు డిగ్గున మారుని సుప్తునింబలెన్.

## గ్రీష్మర్తువు

శ్లో. సితేషు హర్మ్యేషు నిశాసు యోషితాం
సుఖప్రసుప్తాని ముఖాని చంద్రమాః,
విలోక్య నూనం భృశముత్సుకశ్చిరం
నిశాక్షయే యాతి హ్రియేవ పాండుతామ్.

తే.గీ. హర్మ్యతలముల సుఖనిద్ర నందియున్న
స్త్రీల ముఖముల సోత్కంఠఁ జాలతడవు
కాంచు హిమరోచి లజ్జాప్తి కతనఁగాదె
పాలిపోవును ప్రత్యుషఃకాలమందు.

శ్లో. అసహ్యవాతోద్ధతరేణుమండలా
ప్రచండసూర్యాతపతాపితా మహీ,
న శక్యతే ద్రష్టుమపి ప్రవాసిభిః
ప్రియావియోగానలదగ్ధమానసైః.

తే.గీ. తాళఁజాలని వాతోత్థధూళివలన
అధికతపనోష్మపరితప్త మగుటవలన
సరణి చూచుటకైన నశక్యమయ్యె
బాధవిరహాగ్నిపరిదగ్ధపాంథతతికి.

శ్లో. మృగాః ప్రచండాతపతాపితా భృశం
తృషా మహత్యా పరిశుష్కతాలవః,
వనాంతరే తోయమితి ప్రధావితా
నిరీక్ష్య భిన్నాంజనసన్నిభం నభః.

చ. ఘనతపనోష్మతాపమున గాసిలి బిట్టుగ జంతుజాలముల్
ఘనతృషచేత శుష్కమయి కాకుదముల్ వెతఁబెట్ట నూర్చుచుః
వనమునఁ జూర్ణితాంజనముభంగిఁ బ్రభాసితమైన నాకముః
వనచయమంచు భ్రాంతిఁగొని పర్విడె నా దెసకేసి త్రావఁగన్.

## గ్రీష్మర్తువు

శ్లో. సవిభ్రమైః సస్మితజిహ్మవీక్షితై
ర్విలాసవత్యో మనసి ప్రవాసినాం,
అనంగసందీపనమాశు కుర్వతే
యథా ప్రదోషాః శశిచారుభూషణాః.

తే.గీ. విభ్రమాన్వితంబులు, స్మితవిలసితములు,
వక్రములునైన చూపుల న్వనిత లిపుడు
చంద్రరుచిభాసురప్రదోషంబు పగిది
నధ్వగుల కాశువుగఁ గూర్తు రతనుదీప్తి.

శ్లో. రవేర్మయూఖైరభితాపితో భృశం
విదహ్యమానః పథి తప్తపాంసుభిః,
అవాఙ్ముఖో జిహ్మగతిశ్శ్వసన్ ముహుః
ఫణీ మయూరస్య తలే నిషీదతి.

చ. ఖరకరతీక్ష్ణతాపమున గాలఁగ మేనులు, పొఱుచున్ ఫణుల్
సరణుల నుష్ణపాంసువుల సంగతి నింకను గాలి, యూర్చుచు
న్నతిమతి, వక్రమౌనడలు, నమ్రములౌ వదనంబు లేర్పడన్,
సరగున నెమ్మిపింఛియపుఁజాయల దూరుచు విశ్రమించెడిన్.

శ్లో. తృషా మహత్యా హతవిక్రమోద్యమః
శ్వసన్ముహుర్దూరవిదారితాననః,
న హంత్యదూరేఽపి గజాన్ మృగేశ్వరో
విలోలజిహ్వశ్చలితాగ్ర కేసరః.

చ. తొఱఁగుచు విక్రమోద్యమముఁ దోరపుదప్పికచేత సింహము
ల్లతిమతి యూర్చుచున్ ముఖముల్ వివృతంబొనరించి నాల్కలం
దరమిడి వెల్కిఁదట్టుచు, విదల్చుచు జూలును డస్సి చెంతనే
కరులు జరించుచుండినను ఘాతమొనర్పఁగఁ బోవొకింతయున్.

## గ్రీష్మర్తువు

శ్లో. విశుష్కకంఠాహృతశీకరాంభసః
గభస్తిభిర్భానుమతోఽనుతాపితాః,
ప్రవృద్ధతృష్ణోపహతా జలార్థినో
న దంతినః కేసరిణోఽపి బిభ్యతి.

తే.గీ. బాధశుష్కకంఠాహృతాంభస్స్ఫృతంబు
లుగ్రతపనాంశుసంతప్తవిగ్రహంబు
లైన దంతు లత్యంతజలార్థు లగుచు,
హరులనేనియు వెఱవక తిరుగుచుండె.

శ్లో. హుతాగ్నికల్పై స్సవితుర్గభస్తిభిః
కలాపినః క్లాంతశరీరచేతసః,
న భోగినం ఘ్నంతి సమీపవర్తినం
కలాపచక్రేషు నివేశితాననమ్.

తే.గీ. ప్రచురమౌ హుతాగ్నినిభరవ్యంశుతతులఁ
గ్లాంతచేతస్తనులయి కలాపు లిపుడు
చెంతఁజేరి బర్హములందు శిరములుంచు
నురగులనుగూడఁ జంపక యూరకుండు.

శ్లో. సభద్రముస్తం పరిశుష్కకర్దమం
సరః ఖనన్నాయతపోతృమండలైః,
రవేర్మయూఖై రభితాపితో భృశం
వరాహయూథో విశతీవ భూతలమ్.

ఉ. ఎండిన కర్దమంబుగల యేఱులయందున భద్రముస్తలం
దండిగఁ గోరి ముట్టియలఁ ద్రవ్వెడు క్రోడకులంబు లొప్పెడిన్
చండకరోష్ణతీవ్రతను సైపఁగలేక రసాతలంబుఁ జే
రండిగనెంచి భూమిఁ గుహారంబులఁ ద్రవ్వుచునుండెనో యనన్.

# గ్రీష్మర్తువు

శ్లో. వివస్వతా తీక్ష్ణతరాంశుమాలినా
సపంకతోయాత్సరసోఽభితాపితః,
ఉత్ప్లుత్య భేక స్తృషితస్య భోగినః
ఫణాతపత్రస్య తలే నిషీదతి.

తే.గీ. మండుటెండచే దేహంబు లెండిపోవ,
నెండుపడియల బురదలోనుండి యెగిరి,
అధికతృషచేత డస్సిన యహులయొక్క
పడగనీడలఁ గూర్చుండుఁ బ్లవము లిపుడు.

శ్లో. సముద్ధృతాశేషమృణాలజాలకం
విపన్నమీనం ద్రుతభీతసారసం,
పరస్పరోత్పీడనసంహతైర్గజైః
కృతం సరః సాంద్రవిమర్దకర్దమమ్.

చ. కొలఁకులలోన గుంపులుగఁ గూడి పరస్పరఘర్షణంబుచే
గలఁగు గజాళి త్రొక్కుడులగాసికిఁ దాళక త్రెళ్లె మీనముల్,
కలఁగుచుఁ బాఱె బెగ్గురులు, కర్దమ మెల్లెడఁ జిమ్మెఁ బెల్లుగన్,
లలితమృణాలజాలములు లక్షలకొల్దిగఁ దున్కలైపడెన్.

శ్లో. రవిప్రభోద్భిన్నశిరోమణిప్రభో
విలోలజిహ్వాద్వయలీఢమారుతః,
దవాగ్నిసూర్యాతపతాపితః ఫణీ
న హంతి మండూకకులం తృషాకులః.

మ. రవితేజంబున బ్రజ్వరిల్లుచు శిరోరత్నంబు లింపారఁగం
బ్రవిలోలద్రసనాద్వయంబుల సమీరాస్వాదముం జేయుచుం
దవశుష్కార్యమతాపముల్ తనువులం దగ్ధంబొనర్పంగఁ, బెం
పువహింపం దృష, డస్సి పాము లడఁపంబోకుండె భేకంబులన్.

# గ్రీష్మర్తువు

శ్లో. సఫేనలాలావృతవక్త్రసంపుటం
వినిస్సృతాలోహితజిహ్వమున్ముఖం,
తృషాకులం నిస్సృతమద్రిగహ్వరా-
దవేక్షమాణం మహిషీకులం జలమ్.

తే.గీ. ఫేనసంయుతలాలావృతాననంబు
లెత్తి, యెఱ్ఱనాల్కల వెలికొత్తి గహ్వ
రంబుల వెడలి, మహిషంబు లంబువులను
నెమకసాగె నధికతృషాన్వితము లగుచు.

శ్లో. పటుతరదవదాహోచ్ఛుష్కసస్యప్రరోహాః
పరుషపవనవేగోత్క్షిప్తసంశుష్కపర్ణాః,
దినకరపరితాపక్షీణతోయాస్సమన్తా
ద్విదధతి భయముచ్చైర్వీక్ష్యమాణా వనాన్తాః.

ఉ. ఎండెను పైరుమొల్కలు సమేధితతీవ్రవనాగ్నితప్తమై,
మెండగు గాలిసుళ్లఁబడి మింటికిలేచెను శుష్కపర్ణముల్,
చండకరాభితప్తమయి శంబర మెల్లెడ నెండె, నిట్టు లే
కొండలకోనలం గనినఁ గోనలు కొందలపాటుఁ గూర్చెడిన్.

శ్లో. శ్వసితి విహగవర్గః శీర్ణపర్ణద్రుమస్థః
కపికులముపయాతి క్లాంతమద్రేర్నికుంజం,
భ్రమతి గవయయూథః సర్వత స్తోయమిచ్ఛన్
శరభకులమజిహ్మం ప్రోద్ధరత్యంబు కూపాత్.

ఉ. రాలిన పర్ణముల్గలుగు మ్రాఁకుల నుండి ఖగంబు లూర్చెడిన్,
తూలుచు వెట్టచేఁ గపులు దూర్ణముగాఁ బొదరిండ్లు దూరెడిన్,
చాలఁ దృషార్తిచే గవయసంఘము లెల్లెడ నీరుఁ జూచెడిన్,
వ్రాలుచు నేరుగా శరభవారము బావుల వారిఁ గ్రోలెడిన్.

## గ్రీష్మర్తువు

శ్లో. వికచనవకుసుంభస్వచ్ఛసిందూరభాసా
ప్రబలపవనవేగోద్భూతవేగేన తూర్ణం,
తటవిటపిలతాగ్రాలింగనవ్యాకులేన
దిశిదిశి పరిదగ్ధా భూమయః పావకేన.

ఉ. మేలగు సిందురంబు, జిగిమీరు ప్రఫుల్లకుసుంభవిద్యుతిం
బోలుచుఁ గాననాగ్ని, రయపూర్ణమరుత్పరిపుష్టసంభ్రమ
జ్వాలల నేపుమీరి, తటసంస్థితసాలలతాగ్రసంతతిం
బాళిఁ గవుంగిలించుచు నవారితుఁడై దహియించె దిక్కులన్.

శ్లో. జ్వలతి పవనవృద్ధః పర్వతానాం దరీషు
స్ఫుటతి పటునినాదైః శుష్కవంశస్థలీషు,
ప్రసరతి తృణమధ్యే లబ్ధవృద్ధిః క్షణేన
గ్లపయతి మృగవర్గం ప్రాంతలగ్నో దవాగ్నిః.

చ. చిటచిటమండు లోయలను స్నేహితుఁడౌ వడగాలి పెంపునన్
పటపట శుష్కవంశముల బ్రద్దలుగొట్టి గ్రసించు గ్రక్కునన్
పటుతరమైన వేగమున భగ్గునఁ దోఁచును గ్రాసమందునన్
కటకటవెట్టు లేళ్లగమిఁ గాననవహ్ని యుపాంతవర్తియై.

శ్లో. బహుతర ఇవ జాతః శాల్మలీనాం వనేషు
స్ఫురతి కనకగౌరః కోటరేషు ద్రుమాణాం,
పరిణతదళశాఖానుత్పతన్ ప్రాంశువృక్షాన్
భ్రమతి పవనధూతః సర్వతోఽగ్నిర్వనాంతే.

ఉ. బూరుగు మ్రాఁకులందుఁ గడుబొంపు వహించుచు నుద్భవించి, పృ
థ్వీరుహకోటరంబులఁ బ్రదీప్తిలి హాటకగౌరకాంతులన్,
జేరఁగఁ బండుటాకులను జెన్నగు నున్నతవృక్షశాఖలం
బారుచుఁ బైకిపైకి, వనవహ్ని చెలంగె మరుద్విధూతుఁడై.

## గ్రీష్మర్తువు

శ్లో. గజగవయమృగేంద్రా వహ్నిసంతప్తదేహాః
సుహృద ఇవ సమేతా ద్వంద్వభావం విహాయ,
హుతవహపరిఖేదాదాశు నిర్గత్య కక్షా
ద్విపులపులినదేశాం నిమ్నగాం సంవిశన్తి.

ఉ. తీవ్రవనాగ్నితప్తనిజదేహములై మహిషేభసింహముల్
తీవ్రనిసర్గవైరము మదిం దలపోయక, వహ్నిదగ్ధక
క్షవ్రజముం ద్వరం దొఱఁగి, శైవలినీపరిశీతసైకతో
ర్వీవ్రజనంబున న్మెలఁగె, భేదము లేదనుగా విపత్తులోఁ!

శ్లో. కమలవనచితాంబుః పాటలామోదరమ్యః
సుఖసలిలనిషేకః సేవ్యచంద్రాంశుహారః,
వ్రజతు తవ నిదాఘః కామినీభి స్సమేతో
నిశి సులలితగీతే హర్మ్యపృష్ఠే సుఖేన.

చ. వనజవనాంచితాంబువులు, పాటలపుష్పసుగంధివాతముల్,
వనవినిగాహముల్, వనజవైరిమరీచులు, తారహారముల్,
ఘనసుఖదంబులై తనర, కాంతలఁగూడి మనోజ్ఞగానపూ
ర్ణనిశల హర్మ్యపృష్ఠముల రంజిలుఁడీ ముదగాహితాత్ములై.

# వర్షర్తువు

శ్లో. సశీకరాంభోధరమత్తకుంజర
స్తటిత్పతాకో౽శనిశబ్దమర్దలః
సమాగతో రాజవదుద్ధతద్యుతి
ర్ఘనాగమః కామిజనప్రియః ప్రియే.

ఉ. వారికణప్రవర్త్పతినవాంబుదమత్తమతంగజంబుపై
చారుతటిత్పతాకములు, సాంద్రతరాశనినాదసన్మృదం
గారవము లెసలంగ, బహులాభయుతంబయి, కామిహృన్ముదా
ధారమునై, ఘనాగమము ధాత్రిపుఁ జందము వచ్చెనే చెలీ!

శ్లో. నితాన్తనీలోత్పలపత్రకాన్తిభిః
క్వచిత్ప్రభిన్నాంజనరాశిసన్నిభైః
క్వచిత్సగర్భప్రమదాస్తనప్రభైః
సమాచితం వ్యోమ ఘనైస్సమంతతః

ఉ. ఒక్కెడ మేచకోత్పలదళోత్కటనీలిమచేత నొప్పచుఁ
ఒక్కెడఁ జూర్ణితాంజనచయోపమమేచకకాంతి నూనుచుఁ
ఒక్కెడ గర్భిణీపృథుపయోధరపింగళకాంతి నీనుచుఁ
మిక్కుటమౌచు మేఘములు మిన్నులఁ గప్పెను ప్రావృషంబునన్.

## వర్షర్తువు

శ్లో. తృషాకులై శ్చాతకపక్షిణాం కులైః
ప్రయాచితా స్తోయభరావలంబినః
ప్రయాన్తి మన్దం బహుధారవర్షిణో
వలాహకా శ్శ్రోత్రమనోహరస్వనాః

మత్తకోకిల. తోరపుందృషఁ జాతకంబులు తోయబిందులఁ గోరుచున్
సూరెలం జరియించుచుండగ, శ్రోత్రరమ్యవిరావముల్
వారిభారనతాంగము ల్సెలువారుచుండగ సాగెడిన్,
ధారలం గురియంగఁబోవు ఘనంబు లల్లన నింగిలోన్.

శ్లో. వలాహకాశ్చాశనిశబ్దమర్దలాః
సురేన్ద్రచాపం దధత స్తటిద్గుణం,
సుతీక్ష్ణధారాపతనోగ్రసాయకై
స్తుదన్తి చేతః ప్రసభం ప్రవాసినామ్.

ఉ. పెల్లగు గర్జలే పొనర భీకరమర్దలనిస్వనంబులై,
వేల్లితమైన శక్రధనువే ధనువై తగ, విస్ఫురత్తటి
ద్వల్లియె మౌర్వియై తనర, వర్షపుధారలె వాఁడితూపులై
చెల్లగఁ బాంథచిత్తములఁ జీల్చునుబో ప్రసభాన నభ్రముల్.

శ్లో. ప్రభిన్నవైడూర్యనిభై స్తృణాంకురైః
సమాచితా ప్రోత్థితకందళీదళైః,
విభాతి శుక్లేతరరత్నభూషితా
వరాంగనేవ క్షితిరిన్ద్రగోపకైః.

మ. అల వైడూర్యపుఁ జూర్ణకాంతులకుఁ దుల్యంబైన ఘాసాంకురం
బులచేఁ బ్రోత్థితకందళీదళముచేఁ బొల్పారు నారుద్రపు
ర్పులచే నావృతమైన ధాత్రి యలరారుం గౌరవర్ణేతరో
జ్జ్వలరత్నాభరణాంచితాంగియగు యోషారత్నముం బోలుచున్.

## వర్షర్తువు

శ్లో. సదామనోజ్ఞం స్వనదుత్సవోత్సుకం
వికీర్ణవిస్తీర్ణకలాపశోభితం,
ససంభ్రమాలింగనచుంబనాకులం
ప్రవృత్తనృత్యం కులమద్య బర్హిణామ్.

చ. సతతము సుందరంబులయి, సంస్వనదుత్సవతత్పరంబులై,
వితతవిలోలవిస్ఫుటితపింఛములై, అనురాగసంభ్రమా
యతిఁ బరిరంభచుంబనసమాకులితాంగములై, మయూరముల్
ప్రతినవనర్తనంబుల విరాజిలె నభ్రరవానుకారులై.

శ్లో. నిపాతయన్త్యః పరితస్తటద్రుమాన్
ప్రవృద్ధవేగైస్సలిలైరనిర్మలైః
స్త్రియః సుదుష్టా ఇవ జాతవిభ్రమాః
ప్రయాన్తి నద్యస్త్వరితం పయోనిధిమ్.

వనప్రియము. రంతు సేయుచు, జాతవిభ్రమరయముచేతఁ గలంగుచున్,
ప్రాంతసంస్థితపాదపంబుల వడిగఁ గూల్చుచు, దుష్టలో
కాంతలట్లు లశుద్ధజీవనకలితలౌచు సముద్రమన్
కాంతుఁ గూడఁగనేగు సంరయగతుల నిమ్నగ లిత్తరిన్.

శ్లో. తృణోత్కరై రుద్గతకోమలాంకురై
ర్విచిత్రనీలైర్హరిణీముఖక్షతైః,
వనాని వైంధ్యాని హరన్తి మానసం
విభూషితాన్యుద్గతపల్లవైర్ద్రుమైః.

చ. తతములు, కోమలాంకురవితానవిరాజితముల్, మృగాస్యసం
క్షతములు, చిత్రనీలరుచిసంయుతముల్ తృణసంవృతావనుల్,
ప్రతినవపల్లవోత్కరవిరాజితముల్ ద్రుమరాజముల్, మనో
జ్ఞతరములయ్యె వింధ్యవిపినస్థలులందున నెందుఁజూచినన్.

## వర్షర్తువు

శ్లో. విలోలనేత్రోత్పలశోభితాననై
ర్మృగైః సమంతాదుపజాతసాధ్వసైః,
సమాచితా సైకతినీ వనస్థలీ
సముత్సుకత్వం ప్రకరోతి చేతసః.

చ. తరళవిలోచనోత్పలవిధా రుచిరాననమంజిమంబుతో,
నుఱుముల మెర్పులం గలుగు నులుకనఁ బర్వులువెట్టు లేళ్లచే
బరఁగెడు సైకతస్థలులఁ బర్విన కాననసీమలం గనన్,
సరసులడెందముల్ ప్రమదసంయుతిఁ బర్వులువెట్టకుండునే?

శ్లో. అభీక్ష్ణముచ్చైర్ధ్వనతా పయోముచా
ఘనాంధకారీకృతశర్వరీష్వపి,
తటిత్ప్రభాదర్శితమార్గభూమయః
ప్రయాన్తి రాగాదభిసారికాః స్త్రియః.

ఉ. భీతి జనింపఁజేయుచు నభీక్ష్ణముగా నినదించు చంబుభృ
జ్జాతము లావరింప నతిసంతమసాన్వితమైన రాత్రులం
దాతతరాగమత్తలగు నంగన లాఘనజాత్మచంచలా
జాతము దారిసూప నభిసారమొనర్తురు జేరఁ గాంతులన్.

శ్లో. పయోధరై ర్భీమగభీరనిస్వనై
స్తటిద్భిరుద్వేజితచేతసో భృశం,
కృతాపరాధానపి యోషితః ప్రియాన్
పరిష్వజంతే శయనే నిరంతరమ్.

తే.గీ. జలదభీమగభీరనిస్వనముచేతఁ
జంచలలచేతఁ జకితలౌ చంచలాక్షు
లక్కజంబుగ నపరాధులైన పతుల
సైత మాశ్లేషములఁ జాల సత్కరింత్రు.

## వర్షర్తువు

శ్లో. విలోచనేందీవరవారిబిందుభిః
నిషిక్తబింబాధరచారుపల్లవాః,
నిరస్తమాల్యాభరణానులేపనాః
స్థితా నిరాశాః ప్రమదాః ప్రవాసినామ్.

ఉ. నల్లని కల్వపూవులో యనందగు కన్నుల నిండి బాష్పముల్
పల్లవకోమలోష్ఠముల పైఁబడి జార, నిరస్తమాల్యలై,
ఒల్లక లేపనాభరణయోగ మొకింత, నిరాశచేతఁ జిం
తిల్లుదు రిప్పుడింతులు విదేశగతప్రియులం దలంచుచున్.

శ్లో. విపాండురం కీటరజస్తృణాన్వితం
భుజంగవద్వక్రగతిప్రసర్పితం,
ససాధ్వసై ర్భేకకులైర్నిరీక్షితం
ప్రయాతి నిమ్నాభిముఖం నవోదకమ్.

ఉ. భోగి తెఱంగు జిహ్మగతిఁబూని, రజస్తృణకీటకౌఘమున్
లోగొనుచుం, బ్లవోత్కరము లుల్కునఁ జేరి నిరీక్ష సేయగన్,
బాగుగ మిట్టలం బడిన వర్షజలంబులు పాండురంబులై
సాగెను నిమ్నభూములకు సంభృతభంగములై రయంబుగన్.

శ్లో. విపత్రపుష్పాం నళినీం సముత్సుకా
విహాయ భృంగాః శ్రుతిహారినిస్వనాః,
పతంతి మూఢా శిఖినాం ప్రనృత్యతాం
కలాపచక్రేషు నవోత్పలాశయా.

తే.గీ. దళములం గోల్పడిన పద్మకులము వీడి,
శ్రావ్యతరఝుంకృతులతో సంభ్రమమున,
లాస్యమొనరించు శిఖుల కలాపములను
తమ్ములని నమ్మి పడు ద్విరేఫమ్ము లందు.

వర్షర్తువు

శ్లో. వనద్విపానాం నవవారిదస్వనైః
మదాన్వితానాం ధ్వనతాం ముహుర్ముహుః,
కపోలదేశా విమలోత్పలప్రభాః
సభృంగయూథై ర్మదవారిభిశ్చితాః.

చ. ద్విరదము లట్లు మేఘములు దీండ్రముగా నినదింప భ్రాంతిచే
ద్విరదకులంబు లున్మదనదీప్తములై విమలోత్పలప్రభా
స్ఫురితమదాఢ్యగండములఁ బుష్పలిహంబులు మూగుచుండగం
దిరుగును బృంహితార్భటుల దిక్కులదల్చుచు నద్రులందునన్.

శ్లో. సితోత్పలాభాంబుదచుంబితోపలాః
సమాచితాః ప్రస్రవణైః సమంతతః,
ప్రవృత్తనృత్యైః శిఖిభిః సమాకులాః
సముత్సుకత్వం జనయన్తి భూధరాః.

చ. అల విశదాంబుజాతసదృశాంబుదచుంబితమైన యశ్మముల్
జలజలఁబాఱు ప్రస్రవణజాలముల న్విలసిల్లు కూటముల్
మిలమిలలాఁను వాలముల మేలుగఁ ద్రిప్పి నటించు నెమ్మలుం
గలుగ మనోహరంబులయి గ్రావములొప్పును ప్రావృషంబునన్.

శ్లో. కదంబసర్జార్జునకేతకీవనం
వికంపయం స్తత్కుసుమాధివాసితః,
సశీకరాంభోధరసంగశీతలః
సమీరణః కం న కరోతి సోత్సుకమ్.

తరలము. అలరు కేతకసర్జకప్రియకార్జునద్రుమవాటులన్
లలిఁ గదల్చుచుఁ దత్సుమంబుల రమ్యగంధము లూనుచున్,
సలిలశీకరసంయుతాంబుదసంగతిం గడు చల్లనై
మలయు వాయువు గూర్పకుండును మానసోత్సుక మేరికిన్?

## వర్షర్తువు

శ్లో. శిరోరుహైః శ్రోణితటావలంబిభిః
కృతావతంసైః కుసుమైః సుగంధిభిః,
స్తనైః సహారైర్వదనైః ససీధుభిః
స్త్రియో రతిం సంజనయన్తి కామినామ్.

ఉ. తోరపు శ్రోణిబింబములఁ దూలుచు నాడు వినీలకేశముల్,
సౌరభపూర్ణపుష్పకృతచారువతంసము లొప్పు శ్రోత్రముల్,
హారవిరాజితస్తనము లాసవవాసితవక్త్రముల్ దగం,
మారశిలీముఖార్తముగ మార్తురు కాంత లభీకచేతముల్.

శ్లో. తటిల్లతా శక్రధనుర్విభూషితాః
పయోధరా స్తోయభరావలంబినః,
స్త్రియశ్చ కాంచీమణికుండలోజ్జ్వలా
హరంతి చేతో యుగపత్ప్రవాసినామ్.

ఉ. మించులచేత, రంగులను మించు సురేశ్వరచాపదీప్తిచే
నంచితమౌచు, శీకరభరానతదేహములౌచు మేఘముల్
కాంచనకాంచుల న్మణులకర్ణికలం దనరారుచున్ స్ఫుర
చ్చంచలగాత్రలౌ చెలులు చయ్యన దోతురు పాంథచేతముల్.

శ్లో. మాలాః కదమ్బనవకేసరకేతకీభి
రాయోజితాశ్శిరసి బిభ్రతి యోషితోఽద్య,
కర్ణాన్తరేషు కకుభద్రుమమఞ్జరీభి
రిచ్ఛానుకూలరచితా నవతంసకాంశ్చ.

ఉ. లీలమెయిన్ సుకేతకహాళిప్రియకేసరపుష్పరాజిచే
మాలలు గూర్చి శీర్షముల మంజులరీతి నలంకరింత్రుః పై
బాళిమెయి న్మనోజ్ఞకకుభద్రుమమంజరుల న్వతంసముల్
స్త్రీలు గ్రథించి కర్ణముల చెంగటఁ దాల్తురు చెల్వుమీరఁగన్.

వర్షర్తువు

శ్లో. కాలాగురుప్రచురచన్దనచర్చితాఙ్గ్యః
పుష్పావతంససురభీకృతకేశపాశాః,
శ్రుత్వా ధ్వనిం జలముచాం త్వరితం ప్రదోషే
శయ్యాగృహం గురుగృహాత్ప్రవిశన్తి నార్యః.

ఉ. ఉరుముల సవ్వడి న్వినిన యోషలు వేగఁ బ్రదోషమందునన్
వరకుసుమప్రశేఖరసువాసితసుందరకేశపాశముల్
కఱియగ లెచ్చుగా గలుగు గందము బూసిన మేనులుం దగన్
గురుగృహము ల్దొలంగి యదిగో చొరుచుండిరి తల్పశాలలన్.

శ్లో. కువలయదళనీలై రున్నతై స్తోయనమ్రైః
మృదుపవనవిధూతైః మన్దమన్దం చలద్భిః,
అపహృతమివ చేత స్తోయదై స్సేన్ద్రచాపైః
పథికజనవధూనాం తద్వియోగాకులానామ్.

చ. కువలయపత్రనీలములు కోమలవాతధుతంబు లింద్రచా
పవిలసితంబు లంబుకణభారనతంబులు నున్నతంబులుం
బ్రవిరహదంబులౌ జలధరంబులు పాంథవధూప్రతప్తహృ
న్నివహముఁ గొల్లలాడి, వడి నింగికిఁ బాఱినయట్లు దోచెడిఁ.

శ్లో. ముదిత ఇవ కదమ్బై ర్జాతపుష్పైస్సమన్తాత్
పవనచలితశాఖైః శాఖిభిర్నృత్యతీవ,
హసితమివ విధత్తే సూచిభిః కేతకీనాం
నవసలిలనిషేకాచ్ఛాన్తతాపో వనాన్తః.

చ. ఉదితనవాంబుధారల ఘనోష్మము వాసినఁ గాననంబు స
మ్మదమునఁబోలె నీపకుసుమచ్ఛవిఁ బూని వెలుంగు నంతటన్,
కదలెడు మంజరీతతుల కైతవమూని యొనర్చు లాసముఁ
మృదుతరకేతకీదళమరీచులచేత నొనర్చు హాసముఁ.

## వర్షర్తువు

శ్లో. శిరసి వకుళమాలాం మాలతీభిస్సమేతాం
వికసితనవపుష్పై ర్యూథికాకుట్మలైశ్చ,
వికచనవకదమ్బైః కర్ణపూరం వధూనాం
రచయతి జలదౌఘః కాన్తవత్కాల ఏషః.

ఉ. అందముఁ జిందు జాదులను, నప్పుడె విచ్చెడి మొల్లమొగ్గలం,
గందపుఁ గేసరంబులను గట్టిన మాలలఁ గొప్పులందునన్,
పొందుగ నీపపుష్పకృతభూషలఁ గర్ణములందుఁ గూర్చి, యా
నందముఁ గూర్చు నీటితరి నాథుని చందము స్త్రీల కిత్తరిన్.

శ్లో. దధతి వరకుచాగ్రైరున్నతైర్హారయష్టిం
ప్రతనుసితదుకూలాన్యాయతైః శ్రోణిబిమ్బైః,
నవజలకణ సేకాదుద్గతాం రోమరాజిం
లలితవలివిభఙ్గై ర్మధ్యదేశైశ్చ నార్యః.

ఉ. శుభ్రసుతారహారముల సుందరపీనపయోధరంబులం,
దభ్రసితాంశుకంబుల నదభ్రసువృత్తనితంబసీమలం
దభ్రపతన్నవాంబుపృషదాపులకాంకితసద్వళిత్రయిం
దభ్రవలగ్నదేశములఁ దాల్తురు విభ్రమమొప్ప భామినుల్.

శ్లో. నవజలకణసంగాచ్ఛీతతా మాదధానః
కుసుమభరనతానాం లాసకః పాదపానాం,
జనితరుచిరగన్ధః కేతకీనాం రజోభిః
పరిహరతి నభస్వాన్ ప్రోషితానాం మనాంసి.

ఉ. నూతనవారిపృషత్తతుల నొయ్యనఁ దాకుచు శైత్యమూనుచున్,
జాతసుమౌఘభారనతసాలవరంబుల లీల నూపుచున్,
శ్వేతసుకేతకీరజముఁ బెల్లుగఁ దాల్చుచుఁ గమ్మవల్చుచున్,
వాతము వీచె నధ్వగుల భార్యల చేతములన్ హరించుచున్.

## వర్షర్తువు

శ్లో. జలధరవినతానామాశ్రయోఽస్మాకముచ్చై
రయ మితి జలసేకై స్తోయదాస్తోయనమ్రాః,
అతిశయపరుషాభిర్గ్రీష్మవహ్నేః శిఖాభిః
సముపజనితతాపం హ్లాదయన్తీవ విన్ధ్యమ్.

ఉ. ఉన్నతుఁడౌను వింధ్యుఁడు జలోత్కరభారముచేత వంగుచున్
ఖిన్నతనంది తిర్గు మన కీతఁ డొసంగు సమాశ్రయం బటం
చెన్నికసేసి వారిదము లిత్తరిఁ దద్గిరి ఘోరతాపజా
పన్నతఁ బాపనోయన నవారిగ నూనును వర్షధారలన్.

శ్లో. బహుగుణరమణీయః కామినీచిత్తహారీ
తరువిటపలతానాం బాంధవో నిర్వికారః,
జలదసమయ ఏష ప్రాణినాం ప్రాణభూతో
దిశతు తవ హితాని ప్రాయశో వాంఛితాని.

### నయాగరావృత్తము.

నానారమ్యగుణాభిరామమయి, నారీమనోహారియై,
నానానోకహవల్లికాంకురగణప్రాణమిత్రంబునై,
ప్రాణివ్యూహములందు మిన్కుమను ప్రాణస్వరూపంబునై,
జానౌ ప్రావృష మెల్ల ప్రాణులకు సర్వార్థముల్ గూర్చుతన్.

# శరదృతువు

శ్లో. కాశాంశుకా వికచపద్మమనోజ్ఞవక్త్రా
సోన్మాదహంసరవనూపురనాదరమ్యా,
ఆపక్వశాలిలలితానతగాత్రయష్టిః
ప్రాప్తా శరన్నవవధూరివ రూపరమ్యా.

చ. చెలువగు కాశపుష్పముల చీరను దాల్చి, ప్రఫుల్లనీరజో
జ్జ్వలముఖకాంతి మీర, సితపక్షరవాంచితనూపురధ్వనుల్
మలయఁగ, బక్వరమ్యకలమానతగాత్రరుచు ల్సెలంగ, నిం
పొలయఁగ డిగ్గె నవ్యవధువుంబలె నేఁడు శరత్తు ధాత్రికిన్.

శ్లో. కాశైర్మహీ శిశిరదీధితినా రజన్యో
హంసైర్జలాని సరితాం కుముదైస్సరాంసి,
సప్తచ్ఛదైః కుసుమభారనతై ర్వనాన్తాః
శుక్లీకృతాన్యుపవనాని చ మాలతీభిః.

ఉ. తెల్లన వెన్నెలన్ రజని, తెల్లన ధారుణి రెల్లుపూవులన్,
తెల్లన హంసల న్నదులు, తెల్లన చెర్వులు కైరవంబులన్,
తెల్లన సప్తపర్ణపరిదీప్రసుమంబులఁ గాననంబులున్,
తెల్లన సన్నజాజివిరితీవెల నిష్కుటముల్ శరత్తునన్.

## శరదృతువు

శ్లో. చఞ్చన్మనోజ్ఞశఫరీరశనాకలాపాః
పర్యన్తసంస్థితసితాణ్డజపఙ్క్తిహారాః,
నద్యో విశాలపులినాన్తనితమ్బబిమ్బాః
మన్దం ప్రయాన్తి ప్రమదాః ప్రమదా ఇవాద్య.

ఉ. వారిసముత్పతచ్ఛఫరవారమనోహరమేఖలావళుల్,
తీరములందు బారులగు తెల్లనిపుల్గుల హారపంక్తులున్,
స్ఫారితదీప్త సైకతవిశాలనితంబము లుల్లసిల్లగన్,
వారణయానలోయనఁగ, వాహినులిత్తరి సాగె మెల్లగన్.

శ్లో. వ్యోమ క్వచిద్రజతశఙ్ఖమృణాలగౌరైః
త్యక్తామ్బుభిర్లఘుతయా శతశః ప్రయాతైః,
సంలక్ష్యతే పవనవేగచలైః పయోదైః
రాజేవ చామరవరై రుపవీజ్యమానః.

చం. సురుచిరశంఖరౌప్యబిసశోభను దాల్చుచుఁ, ద్యక్తవారిపృష
ద్భరమునఁ జుల్కనౌచుఁ, ద్వరితానిలసంహతిఁ దున్కలౌచు, సం
సరణమునందుచున్న ఘనసంతతి నొప్పెడు వ్యోమమొప్పుఁ జా
మరముల వీచులన్ సుఖసమాహితుఁడైన నృపాలు చాడ్పునన్.

శ్లో. భిన్నాఞ్జనప్రచయకాన్తి నభో మనోజ్ఞం
బన్ధూకపుష్పరచితారుణతా చ భూమిః,
వప్రాశ్చ చారుకమలావృతభూమిభాగాః
ప్రోత్కంఠయన్తి న మనో భువి కస్య యూనః.

మత్తకోకిల. చూర్ణితాంజనసంచయాసితశోభచేఁ దగు వ్యోమమున్,
పూర్ణశోణములైన మంకెనపూల నిండిన భూములన్,
వర్ణనీయమహోత్పలాంచితవప్రభాగములం గనన్,
పూర్ణయౌవనుఁడైన యెవ్వఁడు పొందకుండు విమోహమున్!

## శరదృతువు

శ్లో. మన్దానిలాకులితచారుతరాగ్రశాఖః
పుష్పోద్గమప్రచయకోమలపల్లవాగ్రః,
మత్తద్విరేఫపరిపీతమధుప్రసేకః
చిత్తం విదారయతి కస్య న కోవిదారః.

ఉ. ధీరసమీరపోతములఁ దీరుగ నూగెడు నగ్రశాఖలుఁ,
చారుసుమోద్గమంబులును, సారుణకోమలపల్లవాగ్రముల్,
కోరి మదద్విరేఫములు గ్రోలుచునున్న మధుప్రసేకముల్,
గూరఁగ నందమౌ చమరికోత్కర మేయెదఁ గోయకుండెడిఁ!

శ్లో. తారాగణప్రవరభూషణముద్వహన్తీ
మేఘావరోధపరిముక్తశశాంకవక్త్రా,
జ్యోత్స్నాదుకూలమమలం రజనీ దధానా
వృద్ధిం ప్రయాత్యనుదినం ప్రమదేవ బాలా.

చం. అమలినతారకాసముదయాభరణంబులతోడ, నంబుభృ
త్సముదయగుంఠనంబు వడి జారఁగ భాసిలు నాస్యచంద్రుతో,
నమలినచంద్రికాసురుచిరాంశుకదీధితితో, శరన్నిశా
ప్రమద పెరుంగు నిత్యపరివర్ధనమొందెడి బాలపోలికన్.

శ్లో. కారణ్డవాననవిఘట్టితవీచిమాలాః
కాదమ్బసారసచయాకులతీరదేశాః,
కుర్వన్తి హంసవిరుతైః పరితో జనస్య
ప్రీతిం సరోరుహరజోరుణితా స్తటిన్యః

మ. వరకారండవవక్త్రఘట్టితములౌ భంగంబులం, దీరసం
చరవద్వ్యాకులపుష్కరాహ్వకలహంసౌఘంబులన్, ఫుల్లప
ద్మరజోరంజితనిర్మలాంబువుల నందంబైన స్రోతస్వినుల్,
సరసంబారఁగఁ బల్కరించు జనులం జక్రాంగనాదంబులన్.

## శరదృతువు

శ్లో. నేత్రోత్సవో హృదయహారిమరీచిమాలః
ప్రహ్లాదకః శిశిరశీకరవారివర్షీ,
పత్యుర్వియోగవిషదిగ్ధశరక్షతానాం
చంద్రో దహత్యతితరాం తనుమంగనానామ్.

చ. ఇతరులకెల్ల నేత్రహృదయేంద్రియసమ్మదకారకంబులై,
సితములు, శీతలామృతసుశీకరసేకములై, జగత్సమం
చితమగు నైందవాంశువులె, చిత్రముగా దహియించి వైచెడిం
బతివిరహప్రలిప్తకవిబాధితచిత్తల గాత్రవల్లులన్.

శ్లో. ఆకమ్పయ న్ఫలభరానతశాలిజాలా
నానర్తయం స్తరువరా న్కుసుమావనమ్రాన్,
ఉత్ఫుల్లపఙ్కజవనాం నళినీం విధున్వన్
యూనాం మనశ్చలయతి ప్రసభం నభస్వాన్.

చం. ఫలభరనమ్రమైన వరిపైరుల నల్లన నూపుచున్, మనో
జ్ఞలలితపుష్పభారనతసాలము లందముగాఁ గదల్చుచున్,
జలజవనంబులం గదిపి సౌరభముం జగమెల్లఁ జల్లుచున్,
లలితమరుత్తు లిత్తరిఁ గలంచెనదో యువమానసంబులన్.

శ్లో. సోన్మాదహంసమిథునైరుపశోభితాని
స్వచ్ఛాని ఫుల్లకమలోత్పలభూషితాని,
మన్దప్రభాతపవనోద్గతవీచిమాలా
న్యుత్కంఠయన్తి సహసా హృదయం సరాంసి.

ఉ. నందితమత్తహంసమిథునౌఘవిభాసితముల్, విలోలదిం
దిందిరసంవృతప్రచురనీరజకైరవసుందరంబులున్,
మందసుగంధికల్యపవమానతరంగితజీవనంబులున్,
నందముఁ గూర్చునెంతొ నళినాకరముల్ జనమానసంబులన్.

# శరదృతువు

శ్లో. నష్టం ధను ర్బలభిదో జలదోదరేషు
సౌదామినీ స్ఫురతి నాద్య వియత్పతాకా,
ధున్వన్తి పక్షపవనైః న నభో బలాకాః
పశ్యన్తి నోన్నతముఖా గగనం మయూరాః.

ఉ. రంగగు శక్రచాపముల రంజిలవిప్పుడు వారిదావళుల్,
నింగిఁ బతాకలట్లు జిగినించుచు మించులు దోఁచవిత్తరిన్,
నింగిఁ గదల్ప విప్లు ఛదనిర్గతవాతముచే బలాకలున్,
నింగిని గాన విత్తరిని నెమ్ములు మోములనెత్తి మక్కువన్.

శ్లో. నృత్యప్రయోగరహితాఞ్ఛిఖినో విహాయ
హంసా నుపైతి మదనో మధురప్రగీతాన్,
ముక్త్వా కదమ్బకుటజార్జునసర్జనీపాన్
సప్తచ్ఛదా నుపగతా కుసుమోద్గమశ్రీః.

ఉ. లాసము నుజ్జగించిన కలాపుల వీడి మనోజ్ఞగానముల్
భాసురరాజహంసమదవాక్చయమున్ భజియించె నిత్తరిన్,
వాసిఁ దొఱంగినట్టి కకుభద్రుమసర్జకదంబవాటులం
బాసి వికాసలక్ష్మి సుఖవాసముఁ జేసెను శారదీతతిన్.

శ్లో. శేఫాలికాకుసుమగన్ధమనోహరాణి
స్వస్థస్థితాణ్డజకులప్రతినాదితాని,
పర్యన్తసంస్థితమృగీనయనోత్పలాని
ప్రోత్కంఠయన్త్యుపవనాని మనాంసి పుంసామ్.

మత్తకోకిల. నల్లవావిలి పూలతావుల నల్గెలంకుల నింపుచున్,
గొల్లుగొల్లునఁ బల్కు పక్షుల కూజితంబులఁ గూడుచున్,
రెల్లుమళ్లను మేయు కన్నియలేళ్ల కన్నుల కాంతిచే
నుల్లసిల్లుచుఁ దోఁట వెల్లరి కుత్సుకంబును గూర్చెడిన్.

## శరదృతువు

శ్లో. కల్హారపద్మకుముదాని ముహుర్విధున్వ౯
తత్సంగమాదధికశీతలతాము పేతః,
ఉత్కంఠయత్యతితరాం పవనః ప్రభాతే
పత్రాన్తలగ్నతుహినామ్బు విధూయమానః.

చం. కొలఁకులనంటి వీచుచును, గోకనదంబుల కైరవంబులం
జలనమునందఁ జేయుచును, శైత్యమునందుచు నంతలోపలన్,
లలితముగా దళాంతముల లగ్నములైన తుషారబిందులం
జలజల రాల్చుచు౯, లలిఁ బ్రసారములయ్యెఁ బ్రభాతవాతముల్.

శ్లో. సంపన్నశాలినిచయావృతభూతలాని
స్వస్థస్థితప్రచురగోకులశోభితాని,
హంసైః ససారసకులైః ప్రతినాదితాని
సీమాన్తరాణి జనయన్తి నృణాం ప్రమోదమ్.

చం. పెరిగిన శాలిసస్యములఁ బెంపువహించిన భూతలంబులన్,
సరసతృణాభితృప్తమయి, స్వస్థములై తగు గోకులంబులన్,
వరకలహంససారసరవంబులకుం బ్రతివల్కు సీమలం
బరఁగుచు నెందుఁ జూచినను భవ్యములయ్యెను నేఁడు క్షేత్రముల్.

శ్లో. హంసైర్జితా సులలితా గతిరంగనానా
మంభోరుహై ర్వికసితై ర్ముఖచన్ద్రకాన్తిః,
నీలోత్పలై ర్మదకలాని విలోకితాని
భ్రూవిభ్రమాశ్చ రుచిరా స్తనుభి స్తరంగైః.

ఉ. మించెను హంసలిత్తరిని మేలిమిబోటుల మందయానము౯,
మించెఁ బ్రఫుల్లపద్మములు మెల్తల వక్త్రసుచంద్రకాంతులన్,
మించెను నీలపుందొవలు మీననిభాక్షుల నేత్రసంపదన్,
మించెఁ బ్రసూక్ష్మవీచికలు మేచకవేణుల భ్రూవిలాసము౯.

## శరదృతువు

శ్లో. శ్యామా లతాః కుసుమభారనతప్రవాళాః
స్త్రీణాం హరన్తి ధృతభూషణబాహుకాన్తిం,
దన్తావభాసవిశదస్మితవక్త్రకాన్తిం
కఙ్కేళిపుష్పరుచిరా నవమాలతీ చ.

ఉ. చారుసుమప్రవాళభరసంయుతి నమ్రములై ప్రియంగువుల్
మీరెను సుందరీమణుల మేలిమిసొమ్ముల మీరు బాహులన్,
మీరెను రక్తవంజులసమీపవికస్వరశుభ్రమాలతుల్,
చారురదావభాసవిలసత్స్మితరమ్యవధూముఖప్రభన్.

శ్లో. కేశా న్నితాన్తఘననీలవికుఞ్చితాగ్రాన్
ఆపూరయన్తి వనితా నవమాలతీభిః,
కర్ణేషు చ ప్రవరకాంచనకుట్మలేషు
నీలోత్పలాని వివిధాని నివేశయన్తి.

తే.గీ. కడలు ముడిచిన ఘననీలకచములందు,
నింపుదురు జాజిపూవుల నింపుగాను;
కనకకుట్మలంబుల మీరు కర్ణములను,
నీలిగల్వల నుంతురు నెలఁత లిపుడు.

శ్లో. హారైః సచన్దనరసైః స్తనమణ్డలాని
శ్రోణీతటం సువిపులం రశనాకలాపైః,
పాదామ్బుజాని కలనూపురశేఖరైశ్చ
నార్యః ప్రహృష్టమనసోఽద్య విభూషయన్తి.

చం. అల రశనాకలాపముల నంబుధిమేఖలఁబోలు శ్రోణులన్,
మలయజపంకశీతలసుమౌక్తికహారములం గుచంబులన్,
కలరణదుజ్జ్వలాంఘ్రికటకంబుల స్నిగ్ధపదాంబుజంబులన్,
చెలువముమీరఁ దాల్తురు విశేషముదాత్మలు కాంత లిత్తరిన్.

## శరదృతువు

శ్లో. స్ఫుటకుముదచితానాం రాజహంసాశ్రితానాం,
మరకతమణిభాసా వారిణా భూషితానామ్,
శ్రియమతిశయరూపాం వ్యోమ తోయాశయానాం,
వహతి విగతమేఘం చంద్రతారావకీర్ణమ్.

ఉ. అచ్ఛపుఁ బచ్చరానిగల నంచితమైన జలంబులందునన్
విచ్చిన తెల్లగల్వలను, వెల్లని హంసల మండలంబులన్,
ముచ్చటఁగొల్పు పద్మసరముల్ బురుడించును చంద్రతారకా
ద్యుచ్ఛయరమ్యమైన జలదోత్కరవర్జితమైన వ్యోమముఁ.

శ్లో. శరది కుముదసఙ్గాద్వాయవో వాన్తి శీతా
విగతజలదబృందా దిగ్విభాగా మనోజ్ఞాః,
విగతకలుషమమ్భః శ్యానపఙ్కా ధరిత్రీ
విమలకిరణచన్ద్రం వ్యోమ తారావిచిత్రమ్.

చం. కలువల సంగమంబునను గాలులు చల్లనివౌచు వీచెడిఁ,
జలదచయావగుంఠనము జార దిశల్ తెలతెల్లనయ్యెడిఁ,
కలుషము వీడి నీరములు, గట్టిగ నెండి ధరిత్రి మీరెడిఁ,
కలువలతేని, తారకల కాంతులఁ గూడి నభంబు వెల్గెడిఁ.

శ్లో. దివసకరమయూఖై రోచ్ఛధ్యమానం ప్రభాతే
వరయువతిముఖాభం పఙ్కజం జృంభతేఽద్య,
కుముదమపి గతేఽస్తం లీయతే చన్ద్రబిమ్బే
హసితమివ వధూనాం ప్రోషితేషు ప్రియేషు.

ఉ. లీలఁ బ్రభాతమందినుఁడు లేఁజిగిచేతులఁ దట్టిలేపగం
బోలుచు వశ్యభర్తృకల మోముల నుద్గతమయ్యెఁ బద్మముల్,
వ్రాలఁగఁ గైరవాప్తుఁ డపరాంబుధిలోన నిమీలితంబులై
పోలెను కైరవాస్యములు ప్రోషితభర్తల వక్త్రరూపముఁ.

## శరదృతువు

శ్లో. అసితనయనలక్ష్మీం లక్షయిత్వోత్పలేషు,
క్వణితకనకకాఞ్చీం మత్తహంసస్వనేషు,
అధరరుచిరశోభాం బంధుజీవే ప్రియాణాం,
పథికజన ఇదానీం రోదితి భ్రాన్తచిత్తః.

ఉ. నల్లని కల్వలందు నళినాక్షివినీలసునేత్రకాంతులన్,
పెల్లగు హంసికారుతులఁ బ్రేయసి కాంచనకాంచికారుతిన్,
ఫుల్లములైన మంకెనలఁ బొల్తుక వాతెఱకాంతిఁ గాంచి చిం
తిల్లును పాంథుఁడిత్తరిఁ దదీయవియోగవిదారితాత్ముఁడై.

శ్లో. స్త్రీణాం విహాయ వదనేషు శశాంకలక్ష్మీం
కామ్యం చ హంసవచనం మణినూపురేషు,
బంధూకకాన్తిమధరేషు మనోహరేషు
క్వాపి ప్రయాతి సుభగా శరదాగమశ్రీః.

చం. హిమకరరమ్యచంద్రికల నిందుముఖీవదనంబులందునన్,
సుమధురహంసనాదముల జోటుల రత్నపుటందెలందునన్,
సమధికబంధుజీవరుచిఁ జానల యెఱ్ఱని మోవులందునన్,
సమితమొనర్చి, నేఁడెటకొ శాతశరద్రమ యేగుచుండెడిన్.

శ్లో. వికచకమలవక్త్రా ఫుల్లనీలోత్పలాక్షీ
వికసితనవకాశశ్వేతవాసో వసానా,
కుముదరుచిరకాన్తిః కామినీ వోన్మదేయం
ప్రదిశతు శరద్వశ్చేతసః ప్రీతిమగ్ర్యామ్.

చం. సువికచనీరజాస్యమును, సొంపగు నీలనవోత్పలాక్షులున్,
ప్రవిమలకాశపుష్పచయపాండురవస్త్రము, కైరవోత్కర
ప్రవిశదకాంతియుం దగ, వరాంగన చందము నందమైన యీ
ధవళశరత్తు సర్వసుఖదం బగుఁగాత జనంబు కెల్లెడన్.

# హేమంతర్తువు

శ్లో. నవప్రవాళోద్గమసస్యరమ్యః
ప్రఫుల్లలోధ్రః పరిపక్వశాలిః
విలీనపద్మః ప్రపతత్తుషారో
హేమన్తకాలస్సముపాగతోఽయమ్.

చ. నవనవలాడు సస్యములు, నవ్యసముద్గతపల్లవంబులున్,
పువులనెసంగు లొద్దుగులు, పొంజిగిఁ బండిన రాజనంబులుᳲ,
నవకములేని తమ్మిలు, ననల్పములైన తుషారపాతముల్,
వ్యవహితమైన యాతపము లారఁగ వచ్చె హిమాగమం బొగిన్.

శ్లో. మనోహరైః చందనరాగగౌరైః
తుషారకున్దేన్దునిభైశ్చ హారైః,
విలాసినీనాం స్తనశాలినీనాం
నాలంక్రియన్తే స్తనమండలాని.

కం. హితములు గావిపుడింతయు
క్షితిభృద్వక్షోజల కుచసీమల నలరన్,
ప్రతినవచందనపంకిల
సితకుందతుషారచంద్ర శీతలసరముల్.

## హేమంతర్తువు

శ్లో. కాఞ్చీగుణైః కాంచనరత్నచిత్రైః
నో భూషయన్తి ప్రమదా నితమ్బం,
న నూపురై ర్హంసరుతం భజద్భిః
పాదామ్బుజా న్యమ్బుజకాన్తిభాఞ్జి.

తే.గీ. చిత్రమణిమయ స్వర్ణకాంచీగుణంబు
లిపుడు గటిచక్రముల నలంకృతముగావు;
హంసికాకలరుతులీను హంసకంబు
లందముల్దేవు ప్రమదాపదాబ్జములకు.

శ్లో. న బాహుయుగ్మేషు విలాసినీనాం
ప్రయాన్తి సఙ్గం వలయాఙ్గదాని,
నితమ్బబిమ్బేషు నవం దుకూలం
తన్వంశుకం పీనపయోధరేషు.

ఉ. అందముదేవు చేతులకు హాటకకంకణముల్, భుజద్వయిన్
జిందవు కాంతులన్ వివిధచిత్రమణీరచితాంగదంబులున్,
పొందవు సన్నకావులు సమున్నతపీనపయోధరంబులన్,
పొందుఁ దుకూలముల్ చెలుల పూర్ణనితంబవియుక్తనిత్తరిన్.

శ్లో. గాత్రాణి కాలీయకచర్చితాని
సపత్రలేఖాని ముఖామ్బుజాని,
శిరాంసి కాలాగురుధూపితాని
కుర్వన్తి నార్యః సురతోత్సవాయ.

తే.గీ. మ్రానిపసుపును మిసిమినెమ్మేనఁ బూసి
అగురుధూపంబుఁ గేశంబులందుఁ బట్టి
పత్రభంగముల్ ముఖములం బరిలిఖించి
వత్తురిదె స్త్రీలు సురతోత్సవార్థు లగుచు.

శ్లో. రతిశ్రమక్షామవిపాణ్డువక్త్రాః
సంప్రాప్తహర్షాభ్యుదయా స్తరుణ్యః,
హసన్తి నోచ్చైర్దశనాగ్రభిన్నాన్
ప్రపీడ్యమానా నధరానవేక్ష్య.

తే.గీ. బహుళసురతశ్రమక్షామ పాండురాస్య
లైన కాంత లుత్కటసమ్మదాఢ్యలయ్యు,
స్మితమునేకాని హాసంబుఁ జేయరిపుడు
బాధ దంతాగ్రభిన్నోష్ఠబాధకలన.

శ్లో. పీనస్తనోరఃస్థలభాగశోభా
మాసాద్య తత్పీడనజాతఖేదః,
తృణాగ్రలగ్నైః స్తుహినైః పతద్భి
రాక్రన్దతీ వోషసి శీతకాలః.

తే.గీ. పీనకుచయుతోరస్సుల విభను గాంచి,
వాని బీడింపఁ జనియించు వంతచేత,
గార్చునశ్రులు హేమంతకాల మిపుడు,
కల్యతృణసక్తహిమబిందు కైతవమున.

శ్లో. ప్రభూతశాలిప్రసవైశ్చితాని
మృగాంగనాయూథవిభూషితాని,
మనోహరక్రౌంచనినాదితాని
సీమాన్తరాణ్యుత్సుకయన్తి చేతః.

తే.గీ. భూరితర శాలిసస్య సంపూరితములు,
మంజుల మృగాంగనాయూథ మండితములు,
శ్రావ్యతర కహ్వకులనాద సాంద్రములును,
ఐన ప్రాంతంబులెంతొ హృద్యంబులయ్యె.

## హేమంతర్తువు

శ్లో. ప్రఫుల్లనీలోత్పలశోభితాని,
సోన్మాదకాదమ్బవిభూషితాని,
ప్రసన్నతోయాని సుశీతలాని,
సరాంసి చేతాంసి హరన్తి పుంసామ్.

తే.గీ. ఫుల్లనీలోత్పలప్రభాపూర్ణములును,
మత్తకాదంబకులవిలాసాత్తములును,
స్వాదుశీతలస్వచ్ఛాంబుసహితములును,
ఐన సరములు జనమనోహరము లయ్యె.

శ్లో. పాకం వ్రజన్తి హిమజాతశీతై
రాధూయమానా సతతం మరుద్భిః,
ప్రియే ప్రియంగుః ప్రియవిప్రయుక్తా
విపాండుతాం యాతి విలాసినీవ.

తే.గీ. ప్రచురహిమజాతశైత్యాన బండిపోయి,
అవిరతానిలవేల్లిత మగుచునున్న,
ప్రియకవల్లరి కనుపట్టె వెల్లఁబాఱి,
ప్రియునిఁ బాసి వెల్వెలఁబాఱు వెలఁది వోలె.

శ్లో. పుష్పాసవామోదసుగన్ధివక్త్రో
నిఃశ్వాసవాతైః సురభీకృతాఙ్గః,
పరస్పరాఙ్గ వ్యతిరిక్తశాయీ
శేతే జనః కామరసానువిద్ధః.

తే.గీ. ప్రసవరసమద్యవాసితవక్త్రజనిత
క్రమనిశ్వాసగంధిలగాత్రు లైన
కామరసమత్తు లన్యోన్యగాత్రలతలఁ
బెనచి నిదురింత్రు పేరులోఁ బేఁటులట్లు.

## హేమంతర్తువు

శ్లో. దన్తచ్ఛదైః సవ్రణదన్తచిహ్నైః
స్తనైశ్చ పాణ్యగ్రకృతాభిలేఖైః,
సంసూచ్యతే నిర్దయమఙ్గనానాం
రతోపభోగో నవయౌవనానామ్.

ఉ. గాటపుఁ బంటిపోటులను గాయములందిన కోమలోష్ఠముల్,
మీఁటినవిచ్చు చన్నుఁగవ మీరెడు రక్తనఖక్షతాంకముల్,
చాటును సారసాస్త్రసహసాహతులైన మగండ్రు ప్రాయపుం
బోటులఁగూడి సల్పు మరుపోరులపాటుల తీవ్రవైఖరిన్.

శ్లో. కాచిద్విభూషయతి దర్పణసక్తహస్తా
బాలాతపేషు వనితా వదనారవిన్దం,
దన్తచ్ఛదం ప్రియతమేన నిపీతసారం
దన్తాగ్రభిన్నమవకృష్య నిరీక్షతే చ.

ఉ. అద్దముఁ జేతఁబట్టి, తరుణాతపమందు ముఖాబ్జబింబమున్
ముద్దుగ దిద్దుచున్న దొకముద్దియ; అయ్యెడఁ గానకుండునా
నిద్దపుమోవిపైఁ బ్రియుఁడు నిల్పిన గాటపుఁ బంటికాటులన్,
దద్దయుఁ బ్రీతి నాపెదవిఁ దాకి పరీక్ష యొనర్పకుండునా?

శ్లో. అన్యా ప్రకామసురతశ్రమఖిన్నదేహా
రాత్రిప్రజాగరవిపాటలనేత్రపద్మా,
స్రస్తాంసదేశలులితాకులకేశపాశా
నిద్రాం ప్రయాతి మృదుసూర్యకరాభితప్తా.

ఉ. కూరుకు సుంతలేమి నిశిఁ గోకనదచ్ఛవిఁ గ్రాలు గన్నులున్,
తీరుగ స్రస్తమైన భుజదేశములం బొరలాడు కేశముల్,
తీరనికోర్కెఁ దీవ్రరతిఁ దేలుటఁ డస్సిన గాత్రముందగన్,
నీరజనేత్ర యొర్తు శయనించె నదో మృదుభానుతప్తయై.

## హేమంతర్తువు

శ్లో. నిర్మాల్యదామపరిభుక్తమనోజ్ఞగన్ధం
మూర్ధ్నోఽపనీయ ఘననీలశిరోరుహాన్తాః,
పీనోన్నతస్తనభరానతగాత్రయష్ట్యః
కుర్వన్తి కేశరచనా మపరా స్తరుణ్యః.

ఉ. ఉన్నతపీనవర్తులపయోధరభారనతాంగయష్టులున్,
సన్నుతనీలమేఘసదృశాయతకుంతలలైన కామినుల్
నిన్నటిరేయి భోగ్యమయి నేడు సుగంధముఁబాసి మ్లానమై
యున్న ననల్ద్యజించి సొబగొప్ప రచింత్రు సుకేశబంధముల్.

శ్లో. అన్యా ప్రియేణ పరిభుక్తమ పేక్ష్య గాత్రం
హర్షాన్వితా విరచితాధరచారుశోభా,
కూర్పాసకం పరిదధాతి నఖక్షతాఙ్గీ
వ్యాలమ్బినీలలలితాలకకుఞ్చితాక్షీ.

చ. ప్రియపరిభుక్తగాత్రయగు చిత్తరి యొర్తు నిజక్షతాంగముం
బ్రియమునఁ గాంచు; గాంచి మురిపెంబున మోవిని దిద్దు; దిద్ది సం
రయముఖపాతుకాసితచలాచలకుంతలకుంచితాక్షియై
ప్రియనఖరక్షతంబులగు పీనకుచంబులఁ దొడ్గు చోళికన్.

శ్లో. అన్యాశ్చిరం సురతకేళిపరిశ్రమేణ
ఖేదం గతాః ప్రశిథిలీకృతగాత్రయష్ట్యః
సంహృష్యమాణపులకోరుపయోధరాన్తాః
అభ్యఞ్జనం విదధతి ప్రమదాః సుశోభాః.

తే.గీ. గాఢచిరరతిశ్రమఖిన్నగాత్రములకు
మేలుఁగూర్తురు కొందఱు మెలఁతలిపుడు
తైలయుతసమభ్యంజనతంత్రవిధులఁ
దొడలఁ గుచములఁ బుల్కలు గడలుకొనఁగ.

## హేమంతర్తువు

శ్లో. బహుగుణరమణీయో యోషితాం చిత్తహారీ
పరిణతబహుశాలివ్యాకులగ్రామసీమా,
సతతమతిమనోజ్ఞః క్రౌంచమాలాపరీతః
ప్రదిశతు హిమయుక్తః కాల ఏషః ప్రియం వః.

### నయాగరావృత్తము.

నారీవర్గమనోభిరామమయి, నానాగుణస్తుత్యమై,
స్ఫారంబైన సుపక్వశాలివిలసత్పల్లికాప్రాంతమై,
చారుక్రౌంచగణాన్వితంబయి, తుషారాతిశీతంబునై,
ఆరూఢంబగు శైత్యకాలమిపు డానందముం గూర్చుతన్.

# శిశిరర్తువు

శ్లో. ప్రరూఢ శాలీక్షుచయై ర్మనోహరం
క్వచిత్ స్థిత క్రౌంచనినాద రాజితం
ప్రకామకామం ప్రమదాజనప్రియం
వరోరు కాలం శిశిరాహ్వయం శృణు.

తే.గీ. పరిణతానత శాలీక్షు పరివృఢంబు
క్వచిదుపస్థిత క్రౌంచ ధవాంచితంబు
కామవర్ధకం బంగనా కామితంబు
వచ్చెనిదె శిశిరంబు, శుభాంగి! కనవె!

శ్లో. నిరుద్ధ వాతాయన మందిరోదరం
హుతాశనో భానుమతో గభస్తయః
గురూణి వాసాంస్యబలాః సయౌవనాః
ప్రయాన్తి కాలేఽత్ర జనస్య సేవ్యతామ్.

ఉ. బాగగు మూసియుంచిన గవాక్షములున్న గృహాంతరంబులున్
బాగగు నగ్గిమంటలును, భానుకదుష్ణగభస్తి సంతతుల్,
బాగగు మోటువస్త్రములుఁ బ్రాయపులేమల కౌగిలింతలున్,
బాగగు నివ్వియెల్లఁ జలిబాధ నడంప, జనంబు కిత్తరిన్.

## శిశిరర్తువు

శ్లో. న చన్దనం చన్ద్రమరీచిశీతలం
న హర్మ్యపృష్ఠం శరదిన్దునిర్మలం
న వాయవః సాన్ద్రతుషారశీతలాః
జనస్య చిత్తం రమయన్తి సామ్ప్రతమ్.

ఉ. సారముగావు వెన్నెలలఁ జల్లనివౌట సుగంధలేపముల్,
సారముగావు వెన్నెలలఁ జల్లనివైన సుహర్మ్యపృష్ఠముల్,
సారముగావు దెమ్మెరలు సాంద్రతుషారనిపాతశీతముల్,
సారముగావివెల్ల జనసంతతి కింపునుగూర్ప నిత్తరిన్.

శ్లో. తుషార సంఘాత నిపాత శీతలాః
శశాఙ్కభాభిః శిశిరీకృతాః పునః
విపాణ్డు తారాగణ జిహ్మభూషితాః
జనస్య సేవ్యా న భవన్తి రాత్రయః.

చం. అమలినతారకాసముదయంబుల సుందరజిహ్మరూపచం
క్రమణము నర్థి నెవ్వరును గానరు; మున్నె ప్రశీతలంబులై
హిమమున, నాపయిం బ్రకటితేందుకరంబుల నింకఁజల్లనై,
ప్రమదముఁ గూర్పకున్న శిశిరర్తువునందలి దీర్ఘరాత్రులన్.

శ్లో. గృహీత తామ్బూలవిలేపనస్రజః
పుష్పాసవామోదిత వక్త్రపంకజాః
ప్రకామకాలాగురుధూపవాసితం
విశన్తి శయ్యాగృహముత్సుకాః స్త్రియః.

ఉ. కమ్మని వీడెముల్, వివిధగంధవిలేపములున్, సుపుష్పదా
మమ్ములు గొంచుఁ బుష్పరసమద్యసువాసితవక్త్రపంకజా
తమ్ములు గల్గు రామ లసితాగురుధూపిత రమ్యతల్పగే
హమ్ములఁ జేరవత్తురు స్మరాతురచిత్తములూని యిత్తరిన్.

## శిశిరర్తువు

శ్లో. కృతాపరాధా న్బహుశోఽపి తర్జితా౯
సవేపథూనా న్సాధ్వసలుప్తచేతసః
నిరీక్ష్య భర్తౄన్ సురతాభిలాషిణః
స్త్రియోఽపరాధాన్సమదా విసస్మరుః.

ఉ. నీతినిజార్చి, పెక్కులగు నెయ్యపునేరములం బొనర్చి, త
ద్ధేతువుచే నదల్పఁబడి, దీమసమేది వడంకు నాథులన్,
జేతముగందఁ గాంచి, చలిచేత మరుల్ గడలొత్త మత్తులై,
వీతరుషాప్తిఁ గౌఁగిళుల వెంటనె మంతురు కాంతలిత్తరి౯.

శ్లో. ప్రకామకామైర్యువభిః సనిర్దయం
నిశాసు దీర్ఘాస్వభిరామితాశ్చిరం
భ్రమన్తి మన్దం శ్రమఖేదితోరవః
క్షపావసానే నవయౌవనాః స్త్రియః.

తే.గీ. ప్రచురతరకామవశులైన పతులవలన
దీర్ఘసురతాభిరామితదేహులైన
అబల లతిపీడితోరువు లగుచుఁ బగలు
తూలఁగుచుందురు శయ్యల నలఁతినడల.

శ్లో. మనోజ్ఞ కూర్పాసకపీడితస్తనాః
సరాగకౌశేయకభూషితోరవః
నివేశితాన్తః కుసుమైః శిరోరుహైః
విభూషయన్తీవ హిమాగమం స్త్రియః.

ఉ. ఇంపగు రైకలందు బిగియింపగఁ గందు నురోజకుంభముల్
సొంపగు పట్టుపావడల శోభిలు రమ్యమృదూరుయుగ్మముల్
పొంపగు గంధిలప్రసవభూషితకేశకలాపముల్ దగం
బెంపగు కాంతలీ శిశిరవేళకుఁ బెట్టనిసొమ్ములే కదా!

## శిశిరర్తువు

శ్లో. పయోధరైః కుఙ్కుమరాగపిఞ్జరైః
సుఖోపసేవ్యైః నవయౌవనోష్మభిః
విలాసినీభిః పరిపీడితోరసః
స్వపన్తి శీతం పరిభూయ కామినః .

కం. కుంకుమపంకసుపింజర
పంకేజాక్షీ సుసేవ్య వక్షోజభవో
ష్మాంకూరిత సుఖులై, చలి
కంకుశమును వైతురిప్పు డధికజనంబుల్.

శ్లో. సుగన్ధినిశ్వాసవికమ్పితోత్పలం
మనోహరం కామరతిప్రబోధకం
నిశాసు హృష్టాః సహ కామిభిః స్త్రియః
పిబన్తి మద్యం మదనీయముత్తమమ్.

చం. అతులితరాగపూర్ణలగు నంబుజనేత్రలు భర్తృయుక్తలై
రతిహితమాదకాసవము రాత్రులఁ బానము సేతు రిమ్ముగన్
తతనిజగంధిలాస్యజనితానిల మాచషకాంతరమ్ములన్
స్థితమగు నుత్పలంబుల విచిత్రముగాఁ జలియింపఁజేయఁగన్.

శ్లో. అపగతమదరాగా యోషిదేకా ప్రభాతే
కృతనిబిడకుచాగ్రా పత్యురాలిఙ్గనేన
ప్రియతమపరిభుక్తం వీక్షమాణా స్వదేహం
వ్రజతి శయనవాసాద్ వాసమన్యద్ధసంతీ.

చం. బిగువగు కౌఁగిలింతలను బిట్టుగ నిక్కిన చూచుకంబులం
దగు నొకకాంత, పీతమద, తల్పము వీడి ప్రభాతమందునన్
నగుచుఁ, బ్రియప్రభుక్తమగు నంగము మాటికిఁ జూచికొంచు, మం
దగతినదే మఱొక్క భవనంబును జేరఁగ నేగుచుండెడిన్.

## శిశిరర్తువు

శ్లో. అగురుసురభిధూపామోదితం కేశపాశం
గలితకుసుమమాలం తన్వతీ కుఞ్చితాగ్రం
త్యజతి గురునితమ్బా నిమ్నమధ్యావసానా
ఉషసి శయనమన్యా కామినీ చారుశోభా.

చం. గురుతరమైన శ్రోణిపయిఁ గొంచెపుఁ గొనసియాడుచుండఁగన్
తరుణి యొకర్తె వేకువను దల్పము వీడుచుఁ గట్టు ధూపితా
గురుసురభీకృతంబయిన కుంతలపాశమునందుఁ జిక్కి రేఁ
బరువముఁ బాసియున్న ప్రసవావళిఁ జార్చి, సుకేశబంధమున్.

శ్లో. కనకకమలకాన్తైః సద్య ఏవామ్బు ధౌతైః,
శ్రవణతటనిషక్తైః పాటలోపాన్తనేత్రైః,
ఉషసి వదనబిమ్బై రంససంసక్తకేశైః,
శ్రియ ఇవ గృహమధ్యే సంస్థితా యోషితోఽద్య.

ఉ. అప్పుడె ధౌతమైన రుచిరాననముల్ కనకాబ్జకాంతిచే
నొప్పఁగఁ, బాటలేక్షణము లొప్పఁగ నాశ్రవణాయతంబులై,
కప్పుచు నంసభాగములఁ గప్పుమెఱుంగు కచంబు లొప్పఁగన్,
ఒప్పెద రంగనల్ రమలయొప్పున  వేకువ నిండ్లయందునన్.

శ్లో. పృథుజఘనభరార్తాః కిఞ్చిదానమ్రమధ్యాః
స్తనభరపరిఖేదాన్మందమన్దం ప్రజన్త్యః,
సురతసమయవేషం నైశమాశు ప్రహాయ
దధతి దివసయోగ్యం వేషమన్యాస్తరుణ్యః.

చం. ఘనజఘనంపు భారమున గాత్రలతల్వెగడొంద, నున్నత
స్తనభర మోర్వక న్నడలు సన్నఁబడ, న్నడుముల్ నతంబులై
తనరఁగఁ గొందఱింతులు రతంబునకై తగు నైశవేషముల్
తనువులనుండి జార్చి వడిఁ దాల్తురు నూత్నదినార్హవేషముల్.

## శిశిరర్తువు

శ్లో. నఖపదచితభాగా న్వీక్షమాణాః స్తనాన్తాన్
అధరకిసలయాగ్రం దన్తభిన్నం స్పృశన్త్యః,
అభిమతరతవేషం నన్దయన్త్యస్తరుణ్యః
సవితురుదయకాలే భూషయన్త్యాననాని.

చం. ప్రియనఖరాంకితంబులగు పీనకుచంబులఁ గోరి చూచుచున్,
ప్రియరదనక్షతంబులగు బింబసమోష్ఠములం బృశించుచున్,
ప్రియతరమైన యారతుల వేడ్కల నెంచుచు నాత్మఁబొంగుచున్,
పయిద లలంకరింత్రు ముఖపంకరుహంబులఁ బ్రత్యుషస్సునన్.

శ్లో. ప్రచురగుడవికారః స్వాదుశాలీక్షురమ్యః,
ప్రబలసురతకేళిః జాతకందర్పదర్పః,
ప్రియజనరహితానాం చిత్తసంతాప హేతుః,
శిశిరసమయ ఏషః శ్రేయసే వోఽస్తు నిత్యమ్.

### సయాగరావృత్తము

నానారుచ్యగుడాంచితంబు, పరిణద్ధేక్షుశాల్యంచితం
బానంగాధికదర్పయుక్తము, రతానందసందోహమున్,
సూనాస్త్రాహతపాంథచిత్తసహాసోద్యత్పరిశోకంబునై,
జానౌ యీ శిశిరర్తు వెల్లరకు సంశ్రేయముం గూర్చుతన్.

# వసంతర్తువు

శ్లో. ప్రఫుల్లచూతాఙ్కురతీక్ష్ణసాయకో
ద్విరేఫమాలావిలసద్ధనుర్గుణః,
మనాంసి భేత్తుం సురతప్రసఙ్గినాం
వసంతయోద్ధా సముపాగతః ప్రియే.

వనప్రియము. నిగ్గుదేఱిన చూతపల్లవనిశితసాయకసంతతుల్,
అగ్గలంబగు తేఁటిదండుల నలరు నారియుఁ జేకురన్,
దిగ్గునన్ సురతప్రసంగుల ధృతులఁ దూలఁగ నేయుచున్,
లగ్గుగా నుదయించెఁ జైత్రుఁడు లలితగాత్రిరో! కంటివే!

శ్లో. ద్రుమాః సపుష్పాః సలిలం సపద్మం
స్త్రియః సకామాః పవనస్సుగన్ధిః,
సుఖాః ప్రదోషాః దివసాశ్చ రమ్యాః
సర్వం ప్రియే చారుతరం వసన్తే.

ఉ. ద్రుమములు పుష్పవంతములు, తోయజభాసితముల్ దటాకముల్,
ప్రమదలు కామపూరితలు, రమ్యసుగంధిలముల్ సమీరముల్,
ప్రముదదముల్ ప్రభాతములు, బాఢసుఖప్రదముల్ ప్రదోషముల్,
సముదయమయ్యెలే సురభి, సర్వము సుందరమౌనికం జెలీ!

## వసంతర్తువు

శ్లో. వాపీజలానాం మణిమేఖలానాం
శశాఙ్కభాసాం ప్రమదాజనానాం,
చూతద్రుమాణాం కుసుమాన్వితానాం
దదాతి సౌభాగ్యమయం వసన్తః.

కం. వాపీవారికి, మణులం
దాపిన మేఖలలకుఁ గుముదాప్తద్యుతికిన్,
రూపవతుల కామ్రంబుల
కాపాదించెన్ వసంతుఁ డతివైభవమున్.

శ్లో. కుసుమ్భరాగారుణితైర్దుకూలైః
నితమ్బబిమ్బాని విలాసినీనాం,
తన్వంశుకైః కుఙ్కుమరాగగౌరై
రలంక్రియన్తే స్తనమండలాని.

తే.గీ. ఊరునితంబబింబంబులు వరకుసుంభ
రాగరంజితసుదుకూలరాజిఁ డాగె ;
ఉన్నతస్తనకుంభముల్ సన్నకావి
పయ్యెదల డాగె భామినీవ్రతతి కిపుడు.

శ్లో. కర్ణేషు యోగ్యం నవకర్ణికారం
చలేషు నీలేష్వలకేష్వశోకం,
పుష్పం చ ఫుల్లం నవమల్లికాయాః
ప్రయాంతి కాన్తిం ప్రమదాజనానామ్.

తే.గీ. కర్ణముల వెల్గు నవకర్ణికారసుమము,
కదలు ముంగురులం దశోకంబు వెలుఁగు,
ఫుల్లనవమల్లికయు నందె పొందు కాంతి,
కాంతలకు నీ మనోజ్ఞవసంతమందు.

## వసంతర్తువు

శ్లో. స్తనేషు హారాః సితచన్దనార్ద్రాః
భుజేషు సఙ్గం వలయాఙ్గదాని,
ప్రయాన్త్యనఙ్గాతురమానసానాం
నితమ్బినీనాం జఘనేషు కాఞ్చ్యః .

ఉ. చేతులఁ గంకణంబులను, చెన్నగు బాహుల నంగదంబులన్,
శీతలగంధసిక్తమగు స్నిగ్ధసుమౌక్తికహారపంక్తులన్
స్ఫీతకుచంబులన్, జఘనసీమల సారసనంబులన్, మనో
జాతురచిత్తలైన జలజాతనిభాస్యలు దాల్తురిత్తరిన్.

శ్లో. సపత్రలేఖేషు విలాసినీనాం
వక్త్రేషు హేమాంబురుహోపమేషు,
రత్నాన్తరే మౌక్తికసఙ్గరమ్యః
స్వేదాగమో విస్తరతాముపైతి.

ఉ. చిత్రపుఁ బత్రభంగములఁ జెన్నగు భామల హేమపద్మపు
న్మిత్రములైన వక్త్రముల మెండగు స్వేదకణంబు లింపగున్,
చిత్రతరాన్యరత్నగణచిత్రిత మండలమధ్యనీత స
న్మిత్రసితప్రభాకలితనిర్మలమౌక్తికపంక్తియో యనన్ .

శ్లో. ఉచ్ఛ్వాసయన్త్యః శ్లథబన్ధనాని
గాత్రాణి కందర్పసమాకులాని,
సమీపవర్తిష్వధునా ప్రియేషు
సముత్సుకా ఏవ భవన్తి నార్యః .

తే.గీ. ఒడలినంటిన వల్వల ముడులు సడలె,
సడలె తాలిమి, వలవంత నొడలు బడలె,
వెడలె నూర్పులు, కడనున్న ప్రియులఁ జేర,
నెడలు తహతహంపడె నేఁడు పడఁతులకును.

## వసంతర్తువు

శ్లో. తనూని పాణ్డూని సమన్థరాణి
ముహుర్ముహుర్జ్రృంభణతత్పరాణి,
అఙ్గాన్యనఙ్గః ప్రమదాజనస్య
కరోతి లావణ్యససంభ్రమాణి.

కం. తనుతన్, బాండురతన్, జృం
భణతత్పరతన్, మనోజమదజాలసతన్,
ఘనలావణ్యవిజృంభణఁ
గని భోగ్యములయ్యె నేఁడు కాంతలతనువుల్.

శ్లో. నేత్రేషు లోలో మదిరాలసేషు
గండేషు పాండుః కఠినః స్తనేషు,
మధ్యేషు నిమ్నో జఘనేషు పీనః
స్త్రీణామనఙ్గో బహుధా స్థితోఽద్య.

ఉ. అల మదిరాలసంబులగు నక్షులఁ జంచలతన్వహించి, ని
ర్మలత వహించి గండముల, గ్రావకుచంబులఁ గర్కశుండునై,
బలిసినవాఁడునై జఘనభాగములందు, వలగ్నసీమలం
బలుచనివాఁడునై, వివిధభంగులఁ దోఁచె ననంగు డింతులన్.

శ్లో. అఙ్గాని నిద్రాలసవిభ్రమాణి
వాక్యాని కిఞ్చిన్మదలాలసాని,
భ్రూక్షేపజిహ్మాని చ వీక్షణాని
చకార కామః ప్రమదాజనానామ్.

కం. అంగకంబులు నిద్రాలసాన్వితములు,
భాషణంబు లీషన్మదభూషితములు,
వీక్షణంబులు భ్రూక్షేప వేల్లితములు,
గాఁగ నొనరించెఁ జెలులకుఁ గంతు డిపుడు.

## వసంతర్తువు

శ్లో. ప్రియంగుకాలీయక కుఙ్కుమాక్తం
స్తనేషు గౌరేషు విలాసినీభిః,
ఆలిప్యతే చన్దనమఙ్గనాభిః
మదాలసాభిర్మృగనాభియుక్తమ్.

ఉ. కాయజభావమత్తమగు కాయములం దనరారు కామినుల్
తోయజకుట్మలంబులకుఁ దోడగు గౌరపయోధరంబులన్
జాయకముం బ్రియంగువును జందనరక్తకురంగనాభులన్
లీయమొనర్చి కూర్చిన విలేపము లింపుగఁ బూతు రిత్తరిన్.

శ్లో. గురూణి వాసాంసి విహాయ తూర్ణం
తనూని లాక్షారసరంజితాని,
సుగన్ధికాలాగురుధూపితాని
ధత్తే జనః కామమదాలసాని.

తే.గీ. గురుతరాంశుకంబుల వేగఁ బరిహరించి
యావరసరంజితంబులు, నగురుధూప
వాసితంబులైన యలఁతి వస్త్రములనె
దర్పకమదాంగులౌ జనుల్ దాల్తు రిపుడు.

శ్లో. పుంస్కోకిలః చూతరసాసవేన
మత్తః ప్రియాం చుమ్బతి రాగహృష్టః,
కూజద్ద్విరేఫోప్యయమమ్బుజస్థః
ప్రియం ప్రియాయాః ప్రకరోతి చాటు.

తే.గీ. చూతరసమద్యమత్తపుంస్కోకిలంబు
ప్రియను ముద్దాడె ననురాగహృష్టమగుచు,
తమ్మిలోఁ బాడుచుం గండుతుమ్మెదయును
చెలిని నలరించె బహుచాటుచేష్టితముల.

## వసంతర్తువు

శ్లో. తామ్రప్రవాళస్తబకావనమ్రాః,
చూతద్రుమాః పుష్పితచారుశాఖాః,
కుర్వన్తి కామం పవనావధూతాః
పర్యుత్సుకం మానస మఙ్గనానామ్.

తే.గీ. ఎఱ్ఱచివురులగుత్తుల నిలకు వంగి,
పుష్పరంజితశాఖలఁ బొలుపుమీరి,
వాతవిధుతంబులగు చూతపాదపాళి,
సుందరీతతికెంతొ యుత్సుకతఁ గూర్చు.

శ్లో. ఆమూలతో విద్రుమరాగతామ్రం
సపల్లవాః పుష్పచయం దధానాః,
కుర్వన్త్యశోకా హృదయం సశోకం
నిరీక్ష్యమాణా నవయౌవనానామ్.

చ. విద్రుమారుణనవపుష్పవితతిచేత,
కిసలములచేత నిలువెల్ల నెసఁగియున్న
ఈ యశోకంబు రక్తినీక్షించుచున్న
కోడెగాండ్రకు శోకంబె కూర్చుఁగాదె!

శ్లో. మత్తద్విరేఫపరిచుమ్బితచారుపుష్పాః
మన్దానిలాకులితనమ్రమృదుప్రవాళాః,
కుర్వన్తి కామిమనసాం సహసోత్సుకత్వం
చూతాభిరామకలికాస్సమవేక్ష్యమాణాః.

చ. మదవిచలద్విరేఫములు మక్కువఁ బానముసేయు పూవులున్,
గొదలుగఁ బిల్లతెమ్మెరలు గూడి కదల్చు మృదుప్రవాళముల్,
గదురగ హృద్యమైన సహకారతరుస్థితకోరకావళుల్,
గుదురుచు నుత్సుకత్వమును గోరి కనుంగొను కామికోటికిన్.

## వసంతర్తువు

శ్లో. కాన్తాముఖద్యుతిజుషామపి చోద్గతానాం
శోభాం పరాం కురవకద్రుమమంజరీణాం,
దృష్ట్వా ప్రియే సహృదయస్య భవేన్న కస్య
కన్దర్పబాణపతనవ్యథితం హి చేతః.

తే.గీ. హల్లకాస్యల ముఖకాంతిఁ గొల్లలాడి
ఫుల్లమైయున్న కురవకపుష్పరాజిఁ
గాంచ నేరసికు నెడంద గాయపడదు?
బాధకందర్పబాణసంవ్యథితమగుచు!

శ్లో. ఆదీప్తవహ్నిసదృశై ర్మరుతావధూతైః
సర్వత్ర కింశుకవనైః కుసుమావనమ్రైః,
సద్యో వసన్తసమయే హి సమాచితేయం
రక్తాంశుకా నవవధూరివ భాతి భూమిః.

చ. కొఱవులఁబోలె నెఱ్ఱనగు కోమలపుష్పముల న్నతంబులై,
కఱువలిచేత మందముగఁ గంపిలు కింశుకవృక్షరాజిచేఁ
బరఁగుచు భూమి యామనిని భాసిలుఁగాదె నవారుణాంశుకా
వరణముఁ బూని ప్రీడమెయి వచ్చెడు పెండిలికూతురుంబలెన్.

శ్లో. కిం కింశుకైః శుకముఖచ్ఛవిభిర్న భిన్నం
కిం కర్ణికారకుసుమైర్న కృతం ను దగ్ధం,
యత్ కోకిలః పునరయం మధురైర్వచోభిః
యూనాం మనః సువదనానిహితం నిహన్తి.

ఉ. చీలవొ మున్నె చిల్కముకు చెల్వువహించిన కింశుకంబులన్,
కాలవొ మున్నె నిప్పులటు కానల నిండిన కొండగోఁగులన్,
ఏలొకొ క్రొవ్వి యీ పికము లింకను వ్రచ్చు సుకూజితంబులన్,
బాలవిధూపమాలికల వశ్యములైన యువాంతరంబులన్?

## వసంతర్తువు

శ్లో. పుంస్కోకిలైః కలవచోభిరుపాత్తహర్షైః
కూజద్భిరున్మదకలాని వచాంసి భృంగైః,
లజ్జాన్వితం సవినయం హృదయం క్షణేన
పర్యాకులం కులగృహేఽపి కృతం వధూనామ్.

చ. ప్రమదముతోడ శ్రావ్యమగు పాటలఁబాడు వనప్రియంబులన్,
సుమరసపానమత్తమయి సొంపగు ఝంకృతులూను దేఁటులన్,
సముదితలజ్జలై, వినయసన్నుతలై, మగనింటనున్న పు
ణ్యమహిళలే కలంగ, నిక నన్యరతిప్రియ లాగనేర్తురే?

శ్లో. ఆకమ్పయన్కుసుమితాః సహకారశాఖాః
విస్తారయన్పరభృతస్య వచాంసి దిక్షు,
వాయుర్వివాతి హృదయాని హరన్నరాణాం
నీహారపాతవిగమా త్సుభగో వసన్తే.

ఉ. తోదనసేయు మంచుగమితోడ నిషక్తినిబాసి యోగ్యమై,
ఆదటఁ బుష్పరమ్యరుచిరామ్రముల న్మెలమెల్ల నూపుచున్,
మాదకకోకిలౌఘగళమాధురి దిక్కులనెల్ల నింపుచున్,
మోదముఁ గూర్చుచుం బ్రజకు, ముంగిట వీచె వసంతవాయువుల్.

శ్లో. కున్దైః సవిభ్రమవధూహసితావదాతై
రుద్యోతితాన్యుపవనాని మనోహరాణి,
చిత్తం మునేరపి హరన్తి నివృత్తరాగం
ప్రాగేవ రాగమలినాని మనాంసి యూనామ్.

చ. అతులితవిభ్రమాన్వితనవాబ్జనిభాస్యల హాసపంక్తిక
బ్రతియగు శ్వేతకాంతి నలరారెడు మల్లెలతోఁటలం గనన్,
చ్యుతవిషయానురక్తులగు యోగులచిత్తములే చలింపగా
నతివిషయానురక్తులగు యౌవనవంతుల యాత్మలాగునే?

# వసంతర్తువు

శ్లో. ఆలమ్బి హేమరశనాః స్తనసక్తహారాః
కన్దర్పదర్పశిథిలీకృతగాత్రయష్ట్యః,
మాసే మధౌ మధురకోకిలభృఙ్గనాదైః
నార్యో హరన్తి హృదయం ప్రసభం నరాణామ్.

శా. ప్రాలంబోజ్జ్వలభర్మ్మమేఖలలచే, వక్షోజసంసక్తము
క్తాళీహారమరీచిచే, స్మరమదక్షామాంగసందీప్తిచే
న్మత్తారావములూని కోకిలములు న్నీలాళులుం దోడురాన్,
స్త్రీలివ్వేళ హరింతురి కామిమనముల్ దివ్యద్విలాసాఢ్యలై.

శ్లో. నానామనోజ్ఞకుసుమద్రుమభూషితాన్తాన్
హృష్టాన్యపుష్టనినదాకులసానుదేశాన్,
శైలేయజాలపరిణద్ధశిలాతలౌఘాన్
దృష్ట్వా జనః క్షితిభృతో ముదమేతి సర్వః.

నయాగరా వృత్తము.
నానారమ్యసుమాంచితాగమవనాలంకృతాంతంబులన్,
సానందాన్యభృతారవావలితసానుప్రదేశంబులన్,
మాన్యైనట్టి శిలాసుమవ్రజసమావేష్టితాశ్మంబులన్,
జానొశ్శైలము లింపుఁగూర్చు జనసంవీక్ష్యమాణంబులై.

శ్లో. నేత్రే నిమీలయతి రోదితి యాతి శోకం
ఘ్రాణం కరేణ నిరుణద్ధి విరౌతి చోచ్చైః,
కాంతావియోగ పరిఖేదితచిత్తవృత్తిః
దృష్ట్వాఽధ్వగః కుసుమితాన్ సహకారవృక్షాన్.

చ. నయనముల న్నిమీలనమొనర్చును, పొందు నితాంతశోకమున్,
శయమున మూయు ఘ్రాణమును, సార్తిగ నార్చును బిట్టుబిట్టుగన్,
ప్రియ నెడఁబాసి లోన దురపిల్లెడు పాంథుఁడు పుష్పపల్లవ
ప్రయుతమ్మయువామ్రవాటికల వైభవముం గనలేక యుత్తరిన్.

శ్లో. సమదమధుకరాణాం కోకిలానాం చ నాదైః
కుసుమితసహకారైః కర్ణికారైశ్చ రమ్యైః,
ఇషుభిరివ సుతీక్ష్ణైర్మానసం మానినీనాం
తుదతి కుసుమమాసో మన్మథోద్దీపనాయ.

మత్తకోకిల. మత్తకోకిలషట్పదంబుల మంజుగానరవంబులన్,
క్రొత్తపూవుల మీరు మావుల కొండగోఁగుల కాంతులన్,
సత్తువంగని పూలకాలము సాయకంబులచే బలెన్,
క్రొత్తవల్పుల రేపుచింతులఁ గ్రుచ్చుచున్నది వింతగన్.

శ్లో. ఆమ్రీమఞ్జులమఞ్జరీ వరశరః సత్కింశుకం యద్ధనుః
జ్యా యస్యాలికులం కలఙ్కరహితం, ఛత్రం సితాంశుః సితం,
మత్తేభో మలయానిలః పరభృతో యద్వన్దినో లోకజి
త్సోఽయం వో వితరీతనోతు వితనుర్భద్రం వసన్తాన్వితః.

ఉ. ఎవ్వని ధన్వు కింశుకము లెవ్వని బాణము లామ్రమంజరుల్,
ఎవ్వని మౌర్వి తేఁటిగమి, యెవ్వని తెల్లనిఛత్ర మిందుఁడున్,
ఎవ్వని దంతి గంధవహుఁ డెవ్వని బంట్లు పికాళి, లోకజి
త్తెవ్వఁడు తత్స్మరుండు ప్రజ కిమ్ములొసంగుతఁ జైత్రయుక్తుడై.

